Reg. No. 757

# అభినవసరస్వతి

తెలుగు మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

జనపాడు

సంపుటము 18 | 1926 సం॥ మే, జూన్ నెలలు. | సంచిక 2, 3

## విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, బ్రాహ్మణకోడూరు.
౩ బాకరాజు పరాంకుశరావు దేశాయిగారు. యేడవరం.
౪ రామలింగుగారు- నెల్లుట్లసాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావు గార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజ్గంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము.
౧౦ టి, లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, నసీదుపల్లె.
౧౩ పేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి సుబ్బస్వామినాయుడుగారు, కారంచేడు
౧౫ పికుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరు వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానకొండూరు
౧౮ తిరుమల వెంకట చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు- శాతాపురం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

## చందాదారులు.

౧ గోవిందరాజుల మాధవరావుగారు - నగదుకార్ఖానా - సిద్ధిపేట

౨ చేపూరి లక్ష్మీనరసింహారావుగారు - తాలూకాపేష్కారు - సిద్ధిపేట

౩ భీమరావు రామేశ్వరరావుగారు - కరణం - అనంతవరము

౪ తడిసిన గోపాలరెడ్డి దేశాయిగారు - దోంతి

౫ మొలుగు రామయ్యగారు - మసీదుపల్లె

౬ వెన్నవెల్లి కృష్ణయ్యగారు - మనోహరాబాదు

౭ జేతనభట్ల రాధాకృష్ణయ్యగారు - బుకింగుక్లార్కు - బొల్లారం

౮ మల్లావఝ్ఝల రాజగోపాలముగారు - భువనగిరి

౯ రాయచూరి బండేరావుగారు - అయినాపురము

౧౦ గడియారం వెంకటశేషశాస్త్రిగారు - సంగంజాగర్లమూడి

౧౧ యార్లగడ్డ రంగనాయకులు నాయుడుగారు - కారంచేడు

౧౨ పంచాగ్నుల సేతుమాధవశాస్త్రిగారు - పి - వి - ఆర్ - స్కూలు

౧౩ గొల్లపూడి రామనాథయ్యగారు - వకీలు - వంగోలు

౧౪ గురుగంటి పున్నయ్యగారు - వకీలు - వంగోలు

౧౫ కురుగంటి వెంకటరమణయ్యగారు - వంగోలు

౧౬ తులాబందుల చినబ్రాహ్మణయ్యగారు - వడ్డేశ్వరము

౧౭ నోరి వెంకటేశ్వరులుగారు - వకీలు - బాపట్ల

౧౮ ప్రభల వీరరాఘవులుగారు - వకీలు - తెనాలి

౧౯ లక్కరాజు గోపాలరావుగారు - హెడ్డకౌంటెంటు - తెనాలి

౨౦ దివాకరుని కుటుంబశాస్త్రిగారు - దుగ్గిరాల

౨౧ తూములూరి కోటయ్యగారు - పినపాడు [గుంటూరు

౨౨ భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారు-సబ్ కోర్టు క్లార్కు

౨౩ పాటిబండ సూర్యనారాయణరావుగారు - వకీలు - గుంటూరు

౨౪ కొండవటికంటి వెంకటప్పయ్యగారు - వాల్కాటు బ్రదర్సు కంపెని

౨౫ శ్రీగిరిరాజు రాఘవయ్యగారు - గుండ్లపల్లి [నర్సారావుపేట

౨౬ మంచికంటి వెంకటరామయ్యగారు - కంట్రాక్టరు నర్సారావుపేట
౨౭ చావలి వెంకటకృష్ణయ్యగారు-మునిసిపల్ చేర్మేను-నర్సారావుపేట
౨౮ బుర్రా సుబ్రహ్మణ్యశాస్త్రిగారు - తెలుగుపండితులు సికింద్రాబాద్
౨౯ దండెంరాజు లక్ష్మీనరసింహముగారు - పిడుగురాళ్ళ
౩౦ పెద్దిభట్ల కృష్ణమూర్తిగారు - గుంటూరు
౩౧ చోడవరపు దేవరాజుగారు - కంట్రాక్టరు - బెజవాడ
౩౨ చింబినాడ వెంకటరత్నశాస్త్రిగారు - బెజవాడ
౩౩ లంకా సుందరరామశాస్త్రిగారు .. అంబాపురము
౩౪ కేమిడి సాంబశాస్త్రులుగారు - పెదగ్రహారము
౩౫ మల్లాపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు-అనమనమూరు
౩౬ చింతలపాటి రామమూర్తిశాస్త్రిగారు-గుడివాడ
౩౭ గుంటుపల్లి పేరయ్యగారు - కరణము - చెన్నుపల్లె
౩౮ తంగెడ నారాయణరావుగారు - కరణము - తంగెడ
౩౯ గొడుగుల సుబ్బయ్యగారు - కొప్పర్తి
౪౦ బెల్లంకొండ హనుమంతరావుగారు - పమిడిపాడు
౪౧ చతుర్వేదుల నరసింహయ్యగారు - విప్రులపల్లె
౪౨ ఇంజరంపాటి అనంతయ్యగారు - ఉప్పలపాడు
౪౩ ఏలూరు లక్ష్మీనరసింహారావుగారు - కరణము - వరగాని
౪౪ రాచకొండ శివన్నసోమయాజులుగారు - చమళ్ళమూడి
౪౫ అద్దేపల్లి వెంకటప్పయ్యగారు - బెజవాడ
౪౬ పాటిబండ వెంకటరమణయ్యగారు - బెజవాడ
౪౭ ఎల్లేపెద్ది సాంబశివశాస్త్రిగారు - జిల్లాకోర్టువకీలు-గుంటూరు
౪౮ శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు - చినవోగిరాల
౪౯ జటప్రోలు సర్వభద్రముగారు-ట్రైనింగుస్కూలు హెడ్మాస్టరు .
౫౦ మల్లాది పున్నయ్యగారు - నర్సారావుపేట [నర్సారావుపేట

# అభినవసరస్వతి.

సంపుటము ౧౮ { జానపాడు
వైశాఖజ్యేష్ఠమాసములు { సంచిక ౨,౩

## స్వవిషయము.

అగ్నివర్షము గురియుచున్న యీ వైశాఖమున నెంతసమర్థులైన సేవని నిర్వహించి మాట దక్కించుకొనగలరు ! సకాలమునఁ దనుకఁ బత్రిక సంచికలఁ జేయవలెనని శతశోధనముల నేనును, సహస్ర విధములఁ జంద్రికా ముద్రాశాలాధికారులును యత్నించితిమి గాని పరాధీనులము మే మేమిచేయఁగలము. అందుచే వైశాఖ జ్యేష్ఠ మాసముల కొకసంచికగా నిప్పుడు ప్రచురించుచున్నారము గానఁ దాము దయతో గ్రహింపఁ బ్రార్థితులు.

సంపాదకుఁడు.

## ప్రసన్నకోటీశ్వర సంస్థానము.

నర్సారావుపేట తా॥ గోవిందపుర గ్రామవాస్తవ్యులగు గుడిపల్లి అయ్యంభట్లుగారు కోటప్పకొండ క్రింద నొకకోటీశ్వర ప్రతిష్ఠ గావించియుండుట క్రోధన సం॥ ఫాల్గున మాసపత్రికలోఁ దెలిపియుంటిని. వీరు నర్సారావుపేట జమీందారులపైఁ గలిగిన యాగ్రహావేశమున నట్లు ప్రతిష్ఠమాత్రమే జరిపి యూరకుండలేదు. నిత్యనైవేద్యదీపారాధనాది సపర్యలం జేయుచున్నవారు. ఆకోటీశ్వరునకు గర్భాలయము కట్టించుటకు గోవిందపుర నివాసులే యగు వెల్లంపల్లి వెంకటసుబ్బయ్యగారు ౨౦౦౦ రూపాయల సమర్పించియున్నారు. అయ్యంభట్లుగారు ౩౬౦ దినములును దప్పకుండఁ గోటీశ్వరునకు నైవేద్యదీపారాధనలు జరుగుటకు ౩౬౦ మంది ధనదాతలఁ సంపాదించుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఇప్పటికి సుమారు ౨౦౦ మంది యందుల కంగీకరించిరి. వీర లొక్కరొక రొక్కొకపర్యాయము ౩౧ రూపాయలిచ్చినచో వానితోనే యొకదినపు నైవేద్యదీపారాధన యెప్పటికిని జరుగఁదగిన యేర్పాటు నయ్యంభట్లుగారు చేసికొనిరి. తక్కిన ౧౦౦ మందియు లభించుటతోడనే రిజిష్టరుచేయించి యీధనము వసూలుచేయ మొదలుపెట్టుదురు. ఈ ౩౬౦ దినములలో విశేషదినములకు విశేషించి ద్రవ్యమిచ్చువారే యేర్పడిరి. ఆషాఢ శు ద్వైకాదశీ దినపూజకుఁ గమ్మవారిపాలెము కాఁపురముగానుండు కిలారు నాగమ్మగారు ౧౦౦ రూపా

యులు సమర్పించిరి. ఆషాఢ శుక్లపూర్ణిమ నాటి పూజకు గుంటూరు పుర నివాసులగు కొలచలము విశ్వనాథముగారు ౨౦౦ రూపాయల విలగల భూమి సర్పించిరి. మాఖబహుళైకాదశీపూజకు నర్సారావుపేట తా॥ ఇర్లపాడు నామక గ్రామవాస్తవ్యురాలు సూరె మంగమ్మగారు ౪౦౦ రూపాయ లొసంగిరి. మాఖ బహుళ ద్వాదశీదిన సపర్యకు బంధకవి వియ్యన్నగారి భార్య రామలక్ష్మమ్మగారు ౨౦౦ రూపాయ లిచ్చియుండిరి. మాఖ బహుళత్రయోదశీపూజకు రాయసము హనుమంతరాయుడుగారు ౫౦ రూపాయ లొసంగియున్నవారు. మాఖ బ ౧౪ (మహాశివరాత్రి) దినంబున లక్షపత్రిపూజయు నేకాదశ రుద్రాభిషేకము సహస్రదీపప్రదానముం గావించుటకుఁగా బంధకవి వియ్యన్నగారు ౧౨౦౦ రూపాయల విలువగల పల్లపుభూమి సమర్పించుకొనియుండిరి. అయ్యంభట్లుగారిచే మహాశివరాత్ర్యుత్సవ సందర్భమునఁ జేయు నన్నప్రదానమునకుఁగా నేర్పఱుపఁబడిన సత్రమునకును బ్రిసన్న కోటీశ్వర దేవాలయమునకును మధ్యప్రదేశమున బెజవాడ నగర వాస్తవ్యులును వైశ్యులును నగు నిడుముక్కల సుబ్బారాయుడుగారు ౧౦౦౦ రూపాయలతో నొక నూయి త్రవ్వించి శివార్పణము గావించిరి. ఈ పుణ్యక్షేత్రమున నఖిలాండేశ్వరియను పేరుతో నొక పార్వతీవిగ్రహమును శ్రావణ మాసములోఁ బ్రతిష్ఠించుటకుఁగాఁ బ్రయత్నములు జరుగుచున్నవి. ఇట్లు పరమేశ్వరార్చనము తాను జేయుచు నితరులచేతఁ జేయించుటకును శివరాత్ర్యుత్సవ సమయమున నేమి యితర సమయముల నేమి యన్నదాన మాచరించి భూతసంతృప్తి జరుపుటకును బాటుపడియెడి యయ్యంభట్లుగారి కందఱును దోడ్పడు టత్యంతావశ్యకము. కోటీశ్వరునకు మ్రొక్కులు చెల్లించు భక్తులకుఁ బ్రసన్నకోటీశ్వరుఁడే పరమాదరణీయుఁడు. క్రొత్త యొకవింతగాను ప్రాఁత రోఁతగాను భావించు పంచజనులకుఁ బ్రాఁతకోటీశ్వరుని వదలి క్రొత్తకోటీశ్వరుని సేవించుచున్న ట్లంతకుం గ్రొత్తయగు ప్రసన్నకోటీశ్వరుఁడు ప్రకృత సంసేవ్యుఁడు. ప్రసన్నకోటీశ్వరునకు సమర్పించు కానుకలు క్షేత్రపాత్రములు లేని యీదేవుని సపర్యకును నన్నదానాదీతర సౌకర్యములకును నుపయోగపడుట యింకను నిందు విశేషము.

# ఘోరకలి.

ఉ॥ శ్రీరమణీయ వేదరస సేవ యొనర్చుచు బ్రహ్మవర్చసో
దారఫలంబు లందుచు సుధాసమసోమరసంబుఁ ద్రావుచున్
భూరియశోవిలాసములఁ బొంపిరి పోయిననీతనూజు లో
భారతమాత! ని న్నెటు లపారసుఖాంబుధి నోల లార్చిరో. ౧

సీ॥ ప్రతివీథిలో వేదపాఠశాలల నిల్పి,
విహితవిద్యలఁ జదివించునాఁడు,
ప్రతిబ్రాహ్మణుని ముఖబ్రహ్మవర్చసముతో
మకరకుండలదీప్తి మలయునాఁడు,
ప్రతిపల్లెలోని యూపస్తంభజాలముల్
మింటిచుక్కల లెక్కఁ బెట్టునాఁడు,
ప్రతియజ్ఞశాలలో హుతహవిర్ధూమముల్
మబ్బులతో మేల మాడునాఁడు,
తే॥ గీ॥ ప్రొద్దిరాచిల్క లింటింట మోద మలరు
లీల సామగానముల వల్లించునాఁడు
తల్లి ! నీపూర్వవైభవోదారమహిమఁ
దలఁచుకొన్న మామేనులు పులక లెత్తు. ౨

సీ॥ ఘనజటల్ చెప్పించుకొనుచు శిష్యశ్రేణి,
గురువులవెనువెంట నరుగునాఁడు
కులపతియొక్క శిష్యులు బ్రహ్మకాలాన,
లేచి పాఠముల వల్లించునాఁడు
మీఁగాలిపైఁ గండె మెలి వెట్టి వేదముల్,
పాడుచు జందెముల్ వడుకునాఁడు
సోమవల్లుల బండ్ల పై మోపులుగఁ బేర్చి
ప్రతియజ్ఞశాల కంపఁబడునాఁడు
తే॥ గీ అచట శతరాత్రి మిచట సప్తాహ మనుచు
నెల్ల బాప లూళ్ళకుఁ బరు వెత్తునాఁడు

అమ్మ ! నీపురాతనమహాత్వమ్ము నేఁడు
చెప్పుకొని పొంగు మనుచు వ్రాసెనె? విధాత ! 3

మ॥ స్తవనీయం బగువేదశాస్త్రచయ విద్యాపోషి నార్జించి యా
గవిభూతిన్ విలసిల్లి యాత్మబలవిఖ్యాతప్రభావంబుచే
నవనిన్ నీసుతు లేలుకాలమును నార్యావర్తమా ! నాఁటివై
భవ మెట్లుండెనొ ? నేఁడు ఘోరకలిదౌర్భాగ్యంబు ప్రాప్తించెనే.

సీ॥ వేదముల్ నేఁడు నిర్వేదంబులై పోయె,
స్మృతు లన్ని లోకవిస్మృతులఁబడెనె
సవనవాటికలు ఘాసవనవాటిక లయ్యె,
ఋక్కులు యాతనా దృక్కు లయ్యె
వేదాంతమే నేఁడు వేధోఽంతమైపోయె,
గాతలో యశనిసిర్ఘాత లైరి
సోమపానము నేఁడు ధూమపానం బయ్యె,
యూపమే నేఁ డపరూప మయ్యె
తే॥ గీ॥ కర్ణమణికుండలద్యుతుల్ గలసి యాడు
పైఁడిరాయంచనేఁజ్ఞోళ్ళు పాడువడియె
నేఁటి కీఘోరకలి కాల ధాటిఁ జిక్కి
బడలి నీసుతుల్ చతికిలంబడిరి తల్లి ! 4

సీ॥ చదివించువారలు చదువువారలు లేక,
వేదముల్ పాతాళ వీధి కరిగె
పోషింపఁగల యొక్క భూమీధవుఁడు లేక,
సంస్కృతభాషయే సన్నగిల్లె
నేర్చుకోఁగలవారు నేర్పువారలు లేక,
మంత్రశాస్త్రంబులు మాయమయ్యె
ఆదరించెడివార లరు దౌటచే ధర్మ,
శాస్త్రాలఁ బురుగులు చప్పరించె

తే॥గీ॥ సకలవిద్యానిధానప్రశస్తిఁ గాంచి,
కడకుఁ బాడితపుత్రి దుర్గతుల మునిఁగె
నకట ! కలికాలమహిమ యిట్లగుటఁజేసి
భరతవర్షంబుగతి దుఃఖభరిత మయ్యె.

సీ॥ విధవావివాహముల్ వేదసమ్మత మంచుఁ
జట్టముల్ మొలపించు జెట్టియొకఁడు
శాస్త్రీయమే రజస్వలవివాహ మటంచు,
శాసింపఁ దలపెట్టు సరసుఁ డొకఁడు
మాచంకక్రింది వీమాన్యాలు గుళ్ళు గో,
పురము లంచుఁ బెనంగు పురుషుఁ డొకఁడు
నవనిషేకనిబంధనలసృష్టి సేసి దం,
పతుల బందికిఁ దోలు చతురుఁ డొకఁడు
తే॥ గీ॥ పుడమిపైఁ గుక్కగొడుగులు పుట్టునట్లు
చిలిపిచట్టాలు మొలచ మమ్మలఁతవెట్టె
నన్నిదిశలందు సత్కీర్తిఁ గన్న భరత
సంతతికి నేఁటి కీయగచాట్లు వచ్చె.

క॥ నీపుత్త్రులలోఁ గొందఱు, పాపిష్ఠకలి ప్రభునకు బానిసలై దు
ర్వ్యాపారంబులఁబడి మా, కాపదలన్ దెచ్చిపెట్టి రన్యాయముగన్

సీ॥ పాఠశాలలఁ బరభాష దప్ప దటంచు;
దేశభాషను జంపు దిట్ట యొకఁడు
బ్రాహ్మణోద్యోగాలు పడలాగ మాలమా,
దిగల కిప్పించెడి ధీరుఁ డొకఁడు
"విప్రక్షయోఽస్తు" ను విపులపంచాక్షరీ,
జపముచే సిద్ధించు తపసి యొకఁడు
కడజాతులను గర్భగుడిలోని కుసికొల్పి,
జాతికక్షలఁ బెంచు సరసుఁ డొకఁడు
తే॥ గీ॥ బ్రాహ్మణుం డను పూజ్యభావంబు వీడి
విప్రవిద్వేషము వహించు వీరుఁ డొకఁడు

నీసుపుత్రులు కలికరోద్భాసు లగుచుఁ
బ్రాణగోడ్డంపుఁ బనులకుఁ బాలుపడిరి. ౯

శా॥ గోరూపంబును నీవు దాల్చినతఱిన్ గ్రూరుండు శూద్రుండు దు
ష్పారుం డాకలిరాజు దన్నెనని బాష్పశ్రేణులన్ రాల్చి యుం
భారావంబున నేడ్చునిన్నుఁ గని భూపాలుండు రక్షించె నేఁ
డీరీతిన్ గలిబాధ గాసిలినఁ దల్లీ! దిక్కు లేరైరొకో? ౧౦

చ॥ అతులితపూర్వవైభవ మహత్త్వపటుత్వము లందు నెన్నఁ డ
చ్యుతపదరేణువుల్ తనువు సోఁకెడుభాగ్యము లబ్బు నెన్నఁ డం
తు తెగని యీకలిప్రభ యథోగతిలోఁ బడు నెన్నఁడంచుఁ గా
నితరుణమందుఁ గంటఁ దడి నింపకు మంచిదినాలు వచ్చెడిన్. ౧౧

మ॥ చపలుల్ ధర్మము పాడుసేయుచు దురాశాగ్రస్తులై యున్నకా
లపరీపాకముఁ జూచి కల్కియవతారం బెత్తు శ్రీవిష్ణు, పా
పపరీహార మొనర్చు, ఘోరకలివిధ్వంసంబు గావించు, నీ
తిపరుల్ నిన్ భరియింపఁ గాంతువు ధరిత్రీ! పూర్వసౌభాగ్యముల్

క॥ కలివిధ్వంసార్థము శం,బలపురమున విష్ణుయశుని భద్రాత్మజుఁడై
యిలఁ గల్కిరూపధరుఁడై, నలినాక్షుం డవతరించు నడలకు తల్లీ!

తే॥ గీ॥ మాతృభూమిపైఁ గలభక్తి మహిమచేతఁ
దొక్కుకూఁత లీరీతిగా దొరలి వచ్చెఁ
దల్లిపైఁ బ్రేమతోఁ జిన్న పిల్లవాని
వచ్చిరానిమాటలు ముద్దు వచ్చుఁ గాదె? ౧౪

తే॥ గీ॥ సత్కవీశ్వరువలెఁ బద్యసరళి వ్రాసి
నింపినాఁ డని నన్నిసడింపవలదు
నిండుజాబిల్లి మింట వెన్నెలలు గాయఁ
బూఁబొదల వెల్గుమిణ్గురుఁ బుర్వు లేదొ. ౧౫

# మహాభారత కథాతత్త్వ నిర్ణయము.



ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక రుధిరోద్గారి సం॥ర ఆశ్వయుజ పుష్యమాసముల సంచికలో మహాభారతచరిత్ర మను నొకవ్యాసము ప్రచురింపఁబడినది. ఆవ్యాసము వ్రాసినవారలు మహాభారతమును సమగ్రముగాఁ జదివి విషయ పరిశోధనము చేసినందుల కెంతయు సంతసించుచున్నవాఁడను. వారివిమర్శనశక్తియు నాశ్చర్యకరము. శ్రీఅప్పయ దీక్షితులును శ్రీమధ్వాచార్యులును మహాభారతతాత్పర్య నిర్ణయము చేసిరిగాని వారు శివవిష్ణుపారమ్య ప్రతిపాదనమాత్రముతో విరమించిరి. ఈ విమర్శకులు పురాతనాధునాతనపండితాభిప్రాయములకు విరుద్ధముగాఁ బాండవులు దుష్టులనియు వ్యాసుఁడు మోసగాఁడనియు శ్రీకృష్ణుఁ డంతకంటె మోసగాఁడనియు దుర్యోధనాదులు సధర్ములనియుఁ గుంతీద్రౌపదీ సత్యవతులచరితము దూషితమనియు నేమేమో వ్రాసిరి. వీరివ్యాసము సత్యాసత్యముల గమనించుటకై నేనును మహాభారతమును బరిశీలించితిని. వీరివ్యాసము చాల భాగము సత్యదూరమని నానమ్మకము. ఈసంగతి యించుక విమర్శించి వ్రాసెదను. నిష్పక్షపాతచిత్తులు స్థాలీపులాకన్యాయముచే నిజము గ్రహింతురు గాక.

— * విమర్శనీయాంశములు * —

1 మహాభారత రచనాకాల మెద్ది ?

2 మహాభారతము కవిత్రయకృతమా ? వ్యాసమాత్రకృతమా ?

3 సత్యవతీ కుంతీ ద్రౌపదులు పతివ్రతలుగాఁ బరిగణింపఁదగిన వారలా కారా ?

4 పరస్పరవిరుద్ధముగాఁ గాన్పించుకర్ణోత్పత్తికథకు సమన్వయ మెట్లు ?

5 శ్రీకృష్ణుఁడు పూతనాదిరాక్షసుల సంహారించె ననుకథ కల్పనా కథయేనా ? లేక దానియందు నిజము కలదా ?

6 భీముని దుర్యోధనాదులు గంగలోఁద్రోయఁగా నాతఁడు సర్ప రాజగు వాసుకిచే నమృతరసపానము చేయించఁబడెనా ? లేక నాగు లనుపేరుగలయొకజాతిమనుష్యులచేతనే రక్షింపఁబడెనా?

7 అరణ్యపర్వమున రావణుని రాముఁడును గుంభకర్ణుని లక్ష్మ ణుఁడును వధించినట్లు వర్ణింపఁబడినది-దీనికి సమన్వయ మెట్లు ?

ఇదిగాక యీవిమర్శకులు గనుపఱచిన ప్రశ్నలు 15.

1 దుర్యోధనాదులకుఁ బాండవులపైఁ గోపముకలుగుటకుఁ బ్రథ మకారణ మెద్ది ?

2 పాండవుల జన్మవృత్తాంతము, నాఁటివారి కిష్టమయిన స్థితిలోని దేనా ?

3 పాండవ పక్షముగాఁ బనిచేయు భీష్మద్రోణ కృపాదులకు దుర్యోధనునిపైఁ గ్రోధకారణము పాండవుల నాతఁడు విరో ధించుటచేత నేనా ?

4 భీష్మాదులు కేవల మర్థసంబంధముచేత నే దుర్యోధనున కూడి గము చేయునంతటి స్వార్థపరులా ?

5 కేవల మర్థముచేత నే యూడిగమున కొడంబడినవా రయినచో ధర్మరా జింద్రప్రస్థమున రాజ్యముచేసిన 23 సం॥ లలోను వా రేలధర్మరాజుకడ నుండలేదు ? దుర్యోధనుఁ డిచ్చినంత వేత నము ధర్మరా జీయ లేఁడా ?

6 యుద్ధకాలమునందు భీష్మద్రోణ కర్ణ శల్యుల ప్రవర్తనము యుక్తముగానున్నదా ?

7 అభిమన్యువధకాక సౌప్తికవధ విడిచి మహాయుద్ధమునందు దుర్యోధనుఁ డన్యాయముగా నెందఱఁ జంపించెను ? దుర్యోధనుఁ డేయన్యాయములఁ జేసెను ?

8 భీష్మభగదత్తభూరిశ్రవశ్శ్రుతాయు సైంధవద్రోణ దుశ్శాసన దుర్యోధన కర్ణుల వధలలోఁ బాండవులప్రవర్తన మెట్టిది ? వీరులకు యుక్తమగురీతిఁ బ్రవర్తించిరా ?

9 ఘటోత్కచవధకుఁ గృష్ణుఁ డిష్టపడుట యుక్తమా ?

10 శ్రీకృష్ణుని తనయులుగాని సాత్యకితప్ప నాతనిసంబంధులుగాని పాండవులకుఁ దోడురాకుండుటకుఁ గారణమేమి ?

11 ధర్మజ సుయోధనులకు సమానజ్ఞాతులును బాహ్లికదేశమును స్వతంత్రముగా నేలుచుండినవారు నగు బాహ్లిక సోమదత్త భూరిశ్రవస్సులు ధర్మజుని పక్షమునకు రాకపోవుటకుఁ గారణ మేమి ? ధర్మజుని పినతల్లికుమారులగు విందానువిందులు కౌరవపక్షముగా నేలవచ్చిరి ?

12 ప్రకృతి విరుద్ధముగా జన్మించినవారలలో నెందఱు దుర్యోధనునిపక్షమున యుక్తముగాఁబోరాడిరి ? ఎందఱయుక్తముగాఁ బోరాడిరి ? అట్టివారు యుక్తముగా నెందఱు పాండవులపక్షమునఁ బోరాడిరి ?

13 కుంతీ గాంధారుల ప్రవర్తన మెట్టిది ? ద్రౌపదీ ప్రవర్తన మెట్టిది ?

14 ధృతరాష్ట్రుఁడు తనకుమారుల కపార్థములగు దుర్యోధన దుశ్శాసన దుష్ప్రహ దుర్మర్షణ దుర్ముఖ దుర్మదవికటానన బహ్వాశి కుండాశ్యాది నామముల నుంచియుండునా ?

15 యుద్ధానంతరమున దుర్యోధన సంబంధులను బాండవు లెటులఁ జూచిరి ?

వీని నిర్ణయమువలనఁ బాండవధార్తరాష్ట్ర శ్రీకృష్ణాదుల సాధుత్వాసాధుత్వములు నిర్ణయింపఁబడును.

దీనికంతటికిని ప్రథమమున నీవ్యాసము వ్రాసినవారలు కూడ మహాభారతమని వ్యవహరింపఁబడిన యష్టాదశపర్వపరిమిత గ్రంథము ప్రమాణమని యంగీకరింపకతీరదు. అటు లంగీకరించని యెడలఁ గుంతీద్రౌపదులచారిత్రము మంచిది కాదనియు వ్యాసుఁడు మొదలగువారలు మోసగాండ్రనియు నిరూపించుట సంభవించదు. ఆశ్రమవాసాది పర్వములలోనిగాథలను వారుకూడ నుదాహరించి యున్నారు. మహాభారతమును సమగ్రముగాఁ బ్రమాణమని యుభయుల మంగీకరించవలసినప్పుడు కొన్ని ప్రక్షిప్తములని వారనుట యుక్తముగాదు. వారు ద్రౌపదీవస్త్రాపహరణాదిగాథలు ప్రక్షిప్తములనిన యెడల దుర్యోధనోరుభంగసమయ పుష్పవృష్ట్యాదికము బలరామకృతదుర్యోధనాభినందనాదికముఁ జెప్పెడుగాథలు ప్రక్షిప్తములని మే మేలయనఁగూడదు? కనుక నీవాదము యుక్తముకాదు. భారతచరిత్రము నిర్ణయింపఁదలఁచినవా రందఱును సమగ్రమగు మహాభారతము ప్రమాణమని యంగీకరింపకతీరదు. అర్ధజరతీయము యుక్తముకాదు.

## 1. భారతరచనాకాలము.

క్రీస్తుపుట్టుటకుఁ బూర్వము 1485 సం॥ న ప్రారంభమున భారతయుద్ధము జరిగెనని వీరితలంపు. మే మది యంగీకరింపఁజాలము. శ్రీకృష్ణుఁ డేదినమున భూలోకమునుండి వైకుంఠమునకు వెడలెనో ఆదినమే కలియుగారంభమని శ్రీభాగవతైకాదశస్కంధమునఁ గలదు. భారతయుద్ధానంతరము 26 సంవత్సరములకు శ్రీకృష్ణనిర్యాణము జరిగినట్లు భా॥ ఆశ్రమవాసపర్వమున వర్ణింపఁబడినది. ధృతరాష్ట్రాదులకు భారతయుద్ధమృతవీరులను వ్యాసమహర్షి తపఃప్రభావ

ముచే జూపించఁగా మాతండ్రియగు పరీక్షిన్న రేంద్రుని జూపించుమని జనమేజయుఁడు వైశంపాయనుని వేఁడెను. అప్పుడు వైశంపాయన ప్రార్థనచే వ్యాసమహర్షి జనమేజయునకుఁ బరీక్షిన్న రేంద్రాదులఁ జూపించిన ట్లాశ్రమవాసపర్వమందుఁ జెప్పఁబడియున్నది. ఆశ్రమవాస పర్వ 11 అధ్యాయము 35 శ్లో॥ మమాపి వరదో వ్యాసో దర్శయే త్పితరం యది । తద్రూపవేషవయసం శ్రద్దధ్యాం సర్వమేవ తే॥ ప్రియం మే స్యా త్కృతార్థశ్చ స్యా మహం కృతనిశ్చయః। ప్రసాదా దృషిముఖ్యస్య మమ కామ స్సమృద్ధ్యతాం ॥ సౌతి రువాచ॥ ఇత్యుక్తవచనే తస్మి న్నృపే వ్యాసః ప్రతాపవాౘ । ప్రసాద మకరో ద్ధీమా నానయచ్చ పరీక్షితం॥ తత స్తద్రూపవయస మాగతం నృపతిం దివః శ్రీమంతం పితరం రాజా దదర్శ జనమేజయః॥

వ్యాసమహర్షి మృతుఁడగు మాతండ్రిని నాకుఁ జూపించిన యెడల వ్యాసమహర్షి భారతమృతవీరులను జూపించినమాట నమ్మెద నని వైశంపాయనునితో జనమేజయుఁడనెను. అప్పుడు వ్యాసమహర్షి ప్రసన్నుఁడై జనమేజయునకుఁ బరీక్షిన్న రేంద్రాదులఁ గనుపఱచెనని దీని యర్థము.

శ్రీకృష్ణనిర్యాణామే కలియుగారంభము. శ్లో॥ యదా ముకుందో భగవా నిమాం మహీం జహౌ స్వతన్వా శ్రవణీయసత్కథః । తదాహా రే వాప్రతిబుద్ధచేతసా మభద్రహేతుః కలి రన్వవర్తత ॥ మహానుభావుఁడగు శ్రీకృష్ణుఁడు భూలోకము నెప్పుడు వదలెనో యప్పుడే కలియుగము ప్రవేశించిన దని చెప్పెడి యీభాగవత శ్లోక మిందుకుఁ బ్రమాణము. కలియుగారంభము పంచసహస్రాధికమని జ్యోతిషికసంప్రతిపన్నము. కాలనిర్ణయమునకు జ్యోతిశ్శాస్త్రమే ప్రబలప్రమాణము. కలియుగారంభానంతరము షుమారు నూరు సంవత్సరముల ప్రాంతమున వ్యాసమహర్షి మహాభారతమును రచించియుండును. ధృత

రాష్ట్రాదులకు జనకుఁడగు వ్యాసమహర్షి జనమేజయుని నాఁటికిఁ గలఁడాయని శంకింప నవసరముండదు. శ్లో॥ అశ్వత్థామా బలి ర్వ్యాసో హనుమాంశ్చ విభీషణః। కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః। అను పురాణవచన ప్రకారము వ్యాసమహర్షి చిరజీవి గనుక నాఁటికే గాక నేఁటికిఁగూడఁ గలఁడు. శ్రీశంకరులకును విద్యారణ్యులకును దిక్కన సోమయాజికిఁగూడఁ గాశిలో దర్శనమిచ్చిన గ్రాథాఖ్యాయికలు గలవు. వానిని నిష్కారణముగ నప్రమాణము లనుటకు వలను పడదు. యోగ శాస్త్రమునఁ జిరజీవనసాధనములగు యోగములు గలవు. మహాయోగి యగు వ్యాసమహర్షికిఁ జిరజీవన మాశ్చర్యకరము కాదు.

ఇతిహాసపురాణప్రవక్తలు తమచరితమును భవిష్యచ్చరితమును గూడఁ బ్రథమ పురుషప్రయోగములతోడను భూతకాలికక్రియలతోడను వ్రాయుట సంప్రదాయసిద్ధము. శ్లో॥ తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరం నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవం॥ అని వాల్మీకి మహర్షియే తనవృత్తాంతమును బ్రథమపురుషప్రయోగములతోఁ జెప్పెను. భవిష్య ద్రామకథను భూతకాలికక్రియలతోఁ జెప్పెను. ఈసంగతి జగద్విదితము. ఈశ్లోకము ప్రక్షిప్తమనఁ జెల్లదు. ఇది గాయత్రీప్రథమాక్షర ఘటితమనియుఁ జతుర్వింశతి సహస్రగ్రంథాంతర్గతమనియు సకలవిద్వజ్జనసంప్రతిపన్నము. కించిదూన పంచసహస్ర వర్షపరిమితకాలమున మహాభారతము రచింపఁబడినట్లు "తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం। అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మి న్మహా నృషి రిత్యాది శ్లోకములవలన స్పష్టమగుచున్నది. సప్తర్షిమండలములోని పశ్చిమనక్షత్రములు రెండును నశ్విన్యాదినక్షత్రములకు సరిగా నొక్కొకశతవత్సరములుండుననియు నానక్షత్రములు మఖానక్షత్ర సమములై యుండఁగాఁ బరీక్షిత్పరిపాలనము జరిగెననియు శ్రీభాగవతమునను విష్ణుపురాణమునను జెప్పఁబడినది. దానిని బట్టి

చూచినను భారతరచనాకాలము కించిదూన పంచసహస్ర సంవత్సర ప్రాప్తమైయుండును. క్రీస్తుకుఁ బూర్వము పదునాలుగు శతాబ్దముల ప్రాంతమున భారత యుద్ధము జరిగె ననువాదము ప్రపంచముపుట్టి నాలుగువేల సంవత్సరములకు మించలే దనెడి క్రైస్తవుల సిద్ధాంతము వంటిది. దానిని మనము విశ్వసించుటకు వలనుపడదు.

2. భారతము వ్యాసవైశంపాయన సూతకృతమని వీరి వాదము.
దానిని మే మంగీకరింపఁజాలము.

మహాభారత మాఖ్యాయికారహితము 24000 ఇరువదినాలుగు వేలు. ఆఖ్యాయికాసహితమై మనుష్య లోకవ్యాప్తమగు మహాభారతము లక్షపరిమితము. జయము భారతము మహాభారతము ననునవి పర్యాయపదములు. జనమేజయునకు వైశంపాయనునకుఁ జెప్పినట్లును సూతుఁడు శౌనకాదులకుఁ జెప్పినట్లును వ్యాసమహర్షియే స్వరచిత గ్రంథమునఁ జెప్పియున్నాఁడు. మహాభారత మాదిపర్వము మొదలు స్వర్గారోహణపర్వము వఱకును "నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం, దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయే" త్తను శ్లోకము ప్రతిపర్వాదియందును ఘటితమైయున్నది. కాన గ్రంథమంతయు జయసంజ్ఞమనుట యుక్తము. పర్వాంతమునందు "శ్రీమన్మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యా మనియుండుటంబట్టి శతసహస్ర పరిమితగ్రంథము వ్యాసమహర్షి ప్రణీతమని నమ్మఁదగియున్నది. ఆదిపర్వ=అధ్యాయము ౧ శ్లో॥ చతుర్వింశతిసాహస్రీం చక్రే భారత సంహితాం। ఉపాఖ్యానై ర్వినాతావ ద్భారతం ప్రోచ్యతే బుధైః। షష్టిం శతసహస్రాణి చకారాన్యాం ససంహితాం త్రింశచ్ఛత సహస్రంచ దేవలోకే ప్రతిష్ఠితం। పిత్ర్యే పంచదశ ప్రోక్తం గంధర్వేషు చతుర్దశ। ఏకం శతసహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితం॥ ఉపాఖ్యానములను విడిచిన యెడల భారత మిరువది నాలుగువేల గ్రంథమనియు

నిదిగాక యుపాఖ్యానసహిత మరువది లక్షలగ్రంథమును వ్యాసమహర్షియే రచించెననియు నందు ముప్పది లక్షలు దేవలోకములోఁ బ్రచారమందున్నదనియుఁ బితృలోకమందుఁ బదియేను లక్షలును గంధర్వలోకమందుఁ బదునాలుగు లక్షలును మనుష్యలోకమున నొక లక్షగ్రంథమును బ్రచారములోనున్నదనియు దీనియర్థము. దీనినిబట్టిచూడఁగాఁ బ్రకృతమందుఁ గనఁబడుచున్న యష్టాదశపర్వపరిమితమగు మహాభారతము వ్యాసకృతమనియే స్పష్టమగుచున్నది. ఆదిపర్వము ౧ అధ్యాయము శ్లో॥ విస్తీర్యైతన్మహాజ్ఞాన మృషి స్సంక్షిప్య చాబ్రవీత్। ఇష్టంహి విదుషాం లోకే సమాసవ్యాసధారణం॥ సంక్షేపముగాఁ జెప్పిన చతుర్వింశతి సహస్రగ్రంథమును విస్తృతమగు లక్షగ్రంథమును గూడ వ్యాసమహర్షియే చెప్పెనని దీని యర్థము. దీనినిబట్టి కొంత గ్రంథము సూతవైశంపాయనాది కృతమనుట యుక్తముగాదు. శ్లో॥ మన్వాది భారతం కేచి దాస్తీకాది తథాపరే। తథోపరిచరాదన్యే విప్రా స్సమ్యగధీయతే॥ భారతమును మన్వాదిగాఁ గొందఱు ఆస్తీక చరితము మొదలు కొందఱు నుపరిచరవసుచరిత్రము మొదలు కొందఱు నధ్యయనము తమతమశక్త్యనుసారము చేయుదురనియర్థము. కాని యీభారతము లన్నియు భిన్నకర్తృకములని యర్థము కాదు. ముద్రణ యంత్రములు లేని కాలమున లేఖకులు కొందఱు కొన్ని యుపాఖ్యానముల వదలి శక్తికొలఁది వ్రాసికొనియుందురు. శ్రద్ధాళువులు యథామాతృకముగా వ్రాసికొనియుందురు. అంతమాత్రముచేఁ బ్రామాణికులగు ప్రాచీనులు తాము కొన్నికథలను భారతములోఁ గూర్చిరని యూహించుట యన్యాయము. అసత్యభీతి యిప్పటి వారికంటెఁ బ్రాచీనుల కధిక మనుటకు వివదించువా రుండరు.

౩ కుంతీ ద్రౌపదీ సత్యవతుల విషయము.

వసుదేవుని తండ్రియగు శూరునకుఁ బృథయనుకన్య గలదు-ఆకన్యను దండ్రి తన మేనత్తకుమారుఁడును సంతాన రహితుఁడు నగు

# వాల్మీకి రామాయణము.



పవిత్రుఁడును కవియునగు వాల్మీకిమహాఋషియొక్క నామము ప్రతిభరతవర్షీయుని హృదయమును భక్తిపూరితమగునటులఁ జేయుచున్నది. ఆయనచే రచింపఁబడి శాశ్వతముగా నిలిచియున్న రామాయణ మహాకావ్యము మన భరతజాతియొక్క జీవమైయున్నది. భరతవర్షీయులవాఙ్మయ మీప్రపంచమునందు నిలిచియున్నంతకాలమును ఆవీర కావ్యముయొక్క ప్రాశస్త్యము నశింపదు. కవితా వరప్రసాదియగు వాల్మీకిమహాఋషి ఈకావ్యమును భక్తులమనస్సులను చిత్రఫలకముల మీఁద చిత్రించివైచెను. కవితా చమత్కారమునందుగాని, శైలియందుగాని, పదగుంభనమునందుగాని రామాయణముతో సాటియగు కావ్యము ఈప్రపంచవాఙ్మయమునం దెచ్చటను లేదు. ఒకగొప్ప చరిత్రాంశము లలితమును నిరుపమును అగు సంస్కృతమునందు ఈప్రతిభాశాలిచే వర్ణింపఁబడెను. మహాకావ్యమునకు వలయు లక్షణము లేవియు దీనియందు కొఱతపడియుండ లేదు; అభిప్రాయసమ్మేళనమును, క్రియాసమ్మేళనమును ఈకవి మఱచిపోక కావ్యమునందంతటను ఇట్టి నియమముల నన్నిఁటిని పాటించుచువచ్చెను. గూఢముగా ఏర్పాటు కాబడిన ఈవిశ్వమునందంతటను ప్రబలియున్న సన్మార్గతకును, దుర్మార్గతకును జరుగుపోరాటమును గొప్ప నీతిసత్యమును వాల్మీకి ఈమహాకావ్యమునందు వర్ణించెను. శ్రీరాముని సన్మార్గునిగాను రావణుని దుర్మార్గునిగాను ఆయనవర్ణించెను. సుశీలతకును, సన్మార్గమునకును, ఇంకయు మానవదేవ స్వభావములగు అన్నిసద్గుణములకును నిధియు దోషరహితుండునునగు శ్రీరాముఁడు దుర్మార్గుఁడగు రావణునివలన సర్వనష్టముల ననుభవించెను. ప్రారంభమునుండియు, రాజ్యాభిషేకమునుబాం

డుసమయ మాసన్నమయినప్పటినుండియు, రాముడు కష్టములనే అనుభవింపవలసివచ్చెను. రాజాధిరాజుగర్భమున జనించి, బాల్యమునుండియు సర్వసౌఖ్యముల ననుభవించిన రాజపుత్త్రుడు ఒక్కసారిగా వాని నన్నిటిని త్యజించి, కందమూలములను భక్షింపుచు నారపుట్టములను ధరియింపుచు వనవాసియై ద్రిమ్మరుటకుగాను దేశమునుండి వెడలగొట్టబడెను. ఇంతియకాదు. వనవాసము జేయుచుండగ పర్ణశాలయందు రాముడు లేనిసమయమున ఆయనకు దుఃఖోపశమనకారణమగుచు మిగిలియున్న సుందరియు, పతివ్రతయునగు సీతను రావణుడెత్తుకొనిపోయెను, అందుచే తనకున్న సౌఖ్యమునకు మిణుకుమిణుకుమనుచు మిగిలియున్న తుదికిరణమునుగూడ ఆయన గోల్పోయెను. ఇది మొదలుకొని ఆయనకు విపత్తులయొక్కయు దుఃఖములయొక్కయు పరంపర ప్రారంభమాయెను. ఆయనకు అనేకవిధములగు కష్టములు సంభవించెను. ఆశాభంగమునుగూడ బొందెనుకాని ఇట్టిసమయమందును ఆయన తనభార్యకొఱకు వెదుకుచునేయుండెను. ఇట్లాశాభగ్నుడై కష్టములననుభవించుచున్నప్పు డాయనయదృష్టము ఫలించెను. అప్పుడాయన వానరరాజగు సుగ్రీవుని సహాయముచే బ్రహ్మాండమయిన సేనను సమకూర్చుకొని లంకాద్వీపమునకు దరలిపోయెను. ఇచట రావణునితోను తదితరజనులతోను రక్తప్రవాహయుతములగు భయంకరయుద్ధముల నేకములనుసల్పెను ప్రారంభమునందు కొంచెమపజయ మందినను తుదకు రాముడు రావణునిజంపి తనభార్యను గైకొనెను. ఇచటనే వాల్మీకిమహాఋషిమనస్సృష్టియొక్క గొప్పతన మిమిడియున్నది. అంత్యమునకు దుర్మార్గము నణగద్రొక్కి సన్మార్గమే జయించెను. తమనీతిమత నిబంధనలను గాపాడుకొనుటకై హింసనైన ననుభవించుసన్మార్గుల సునీతిసత్యము ఓదార్చి దుఃఖోపశమనము జేయును. "మానవులారా! నీతిపథమునుండియు, న్యాయపథము నుండియు, దొలంగకుడు. ప్రారంభమునందు కష్టముల

ను మిక్కుటముగ అనుభవించినప్పటికిని తుదకు మీరుజయించుట నిశ్చయము. మీ నీతిశ్లాఘ్యతయొక్క 'తేజోవంతమైనప్రకాశమానముమందఱ దుర్మార్గము నశించిపోవును" అని వాల్మీకిమహాఋషి తనసుప్రసిద్ధకావ్యమునందు గొప్పధ్వనితో చాటుచున్నాడు. ఈసుబోధప్రపంచమునందున్న నీతిని ఎల్లప్పుడును సరియైనస్థితియందుండునట్లుగా పాడును.

ఈగొప్పపాఠము నింత పరిస్ఫుటముగ చిత్రించిన మహాకావ్యము, ఈప్రపంచమునందున్న మఱేజాతియందునుగాని లేదు. మిల్టనను ఆంగ్లేయకవివర్యుడు వ్రాసిన నష్టమైనస్వర్గము (Paradise lost) అను కావ్యమును దీసికొని పరిశీలింతము. ఈప్రసిద్ధగ్రంథమునందు 'ఆడం' అను నాయకసన్మార్గుడు, సాటన్ అనునాయకదుర్మార్గుడు. అమాయికుడును సన్మార్గుడును, మానవజాతియెడల నిష్కళంకుడును అగు 'ఆడ' ను లోబఱుచుకొనుటకు, దుర్మార్గమున కధిపతియగు సాటను ప్రప్రథమమునుండియు యత్నించెను. నరకాధిపతియగు దుర్మార్గరాజు, తనదారియందు బెట్టిన మనోవికారహేతువులను, 'ఆడం' నిరోధించెను. కాని పాపము ! ఆనిరోధమునందు జయించలేకపోయెను. అమాయికయు సాధ్వియునగుభార్య నాధారపఱుచుకొని ఆయనను సాటను లోబఱుచుకొనెను. సాటను ఆయనకంటె ప్రధానుడయ్యెను. సన్మార్గము నశించి దుర్మార్గముజయించెను; స్వర్గము నష్టమయ్యెను. ఇదిధర్మాభివృద్ధికి భంగకరమగు అపాయకరమైన బోధయైయున్నది. ఏలయన తుదకు తాను దుర్మార్గముయొక్క బోధకే లోబడవలసియుండునని అభిప్రాయపడినవాడెవ్వడును ఎన్నికష్టములొదవించినను సన్మార్గపథమును విడువగూడదని తలంపడు. మిల్టను మహాపురుషుడును దీర్ఘదర్శియునై యున్నాడు. ఆయన తనతప్పునుగ్రహించి "తిరిగిసంపాదింపబడినస్వర్గము (Paradise Regained)అను గ్రంథమును వ్రాసిపైదానిని సవరించుకొనెను. దీనియందు దేవునికుమారుడు స్వర్గమును తిరిగి

సంపాదించెనను కథాశేషము వ్రాయబడెను. దూరదృష్టియుతుండును, అసమాన మేధావంతుడును అగు వాల్మీకిమహాఋషికిని మిల్టనునకును భేదమిదియే. ఇక్కడనే వాల్మీకిరామాయణముయొక్క ప్రాశస్త్యము వెల్లడియగుచున్నది.

ఇక పాత్రలను చిత్రించుటయందన్నదో వాల్మీకి అద్భుతమైన శక్తిని ప్రకటించియున్నాడు. ప్రతిపాత్రను ఆయన అతిసూక్ష్మముగ వర్ణించి, సంపూర్ణముగ చిత్రించెను. ఈ కావ్యమునందలి ప్రతిపాత్రయును, తప్పుదారినిబోవు మానవకోటికి సరియైనదారిని విశదపఱచు లోకనీతిపాఠమును బోధించుచున్నది. గృహమును సౌఖ్యవంతముగా జేయునట్టియు, సౌఖ్యవంతుడు తనధర్మములను సంతృప్తికరముగ నెరవేర్ప జ్ఞప్తియందుంచునట్టియు, జీవితముయొక్క వివిధసంబంధములు ఈ గొప్పగ్రంథమునందు చక్కగ వర్ణింపబడినవి. ఈగ్రంథమునందు నిండియుండిన, నీతిపాఠములను జీవితమునందు స్పష్టపడుముఖ్యసూత్రములను చదువరులు గ్రహించుటకుగాను రామాయణమునందలివివిధ పాత్రలను క్లుప్తముగా వివరించి విమర్శించెదము.

మొదట దశరథుని దీసికొందము. ఆయన మిక్కిలి సామర్థ్యవంతుడగు రాజు; సర్వసద్గుణ సంపన్నుడు; ఆయన రాజ్యాంగపరిపాలనము దోషరాహిత్యమై దనరారుచున్నది. రాజ్యమందంతటను జనులు సంతృప్తులై యథేష్టముగ నుండిరి. కరుణాసముద్రుడును, నిత్యసత్యవ్రతుడును అయి జనులను కన్నతండ్రివలె న్యాయముగ పరిపాలించెను. తాను రాజ్యమునుండి విశ్రాంతి గొందదలచినపుడు దశరథుడు, తనకొడుకును అయోధ్యరాజ్యము నెక్కించుటకు ముందుగా మంత్రులను, సామంతరాజులను, ప్రజలను బిలిపించి యొకపెద్దసభ గావించి ప్రజాభిప్రాయమును గనుగొనెను.

అంతట దుర్మార్గులచే ప్రబోధితయగుకైకేయి దశరథుడు తన కిదివరకెప్పుడో యిచ్చినవరములను పురస్కరించుకొని రాముని రా

జ్యభ్రష్టునిజేసి రాజ్యమును తనపుత్రునికిమ్మని కోరెను. ఈవిషయము దశరథమహారాజుయొక్క సత్యవ్రతమును, పుత్రునియెడల అవ్యాజానురాగమును వ్యక్తీకరించుచున్నయది. అందుచేతనే రాముడరణ్యవాసమునకు జనినవెంటనే దశరథుడు దుఃఖముచేతను విచారముచేతను చనిపోయెను. ఆయన భార్యాలోలుడని ఎంతమాత్రము తలంపరాదు; ఏలయన తనసత్యవ్రతమును నిలుపుకొనుటకే ఆయన తన ప్రియపుత్రుని అరణ్యవాసమునకు సహితము బంపెను.

పిమ్మట కథానాయకుడగు రాముని దీసికొందము. ఆయన సద్గుణసంజాతుడగు రాజును, పుత్రుండును, భర్తయునై యున్నాడు. తండ్రియాజ్ఞయే తనకు పరమోత్కృష్టమైన ధర్మమని ఆయన తలంచుచుండెను. తనపట్టాభిషేకమునకు సర్వము సంసిద్ధమైయున్నప్పుడు అరణ్యవాసవార్త దెలిసినను ఆయనమనస్సు విచారమునొందక సంతోషపూరితమై యుండెను. తనతండ్రివాక్యములు వృథాబోకుండ జేయుట పుత్రుడగు తనకు విధియని ఆయనభావించెను. తనను ప్రేమించుచున్నపౌరుల సహాయముచే వృద్ధుడగుతండ్రివద్దనుండి రాజ్యమును బలవంతముగ దీసికొనుట ఆయనకు చేతగాకపోలేదు. కాని ఆయనట్టి కృతఘ్నతయగు కార్యమును జేయలేదు. తండ్రివాగ్దానమునెరవేర్చుటకుగాను ఆయన రాజచిహ్నములనుదీసివైచి పాదచారియై అడవులకుబోయెను. ఈభారతవర్షమునందెచటను రాముని నామము దెలియని మానవుడెవ్వడును లేడు. 'రామరాజ్య'మను లోకోక్తి అందరికిని దెలిసినదియే. ఆయన రాజ్యాంగపరిపాలనాక్రమము రాజాధిరాజులనేకులచేబాగడబడి మార్గదర్శకముగ దీసికొనబడినది. ఆయన పరిపాలనాకాలమందెప్పుడును అన్నోదకములకు కఱవు లేదు. క్షామముకలలోనివార్త. దుష్టవ్యాధులవలనజచ్చుటగాని, అకాలమృత్యువువాత బడుటగాని, ఆయన రాజ్యమునందు లేదు. జనులు సర్వదాసౌఖ్యవంతులై సంతోషముతో తమ జీవితముల నవలీలగా వెళ్ళబుచ్చుచుండిరి.

తన ప్రజల జీవితములు సురక్షితములుగాను, వారిగృహములు సంతోషదాయకములుగాను జేయుటయందు ఆయన తనస్వసౌఖ్యము ను జూచుకొనెడివాడుగాడు. ఆయనచేసిన దానధర్మములకు మితిలేదు. బీదలకురక్షకుండై ప్రజలను తన కన్నబిడ్డలకంటె నెక్కుడుగజూచుకొనె ను. మతవివక్షతలేక సర్వమతముల నాదరించుచు, అసంఖ్యాకములగు విద్యాశాలలను ధర్మశాలలను ఆయన స్థాపించెను. ఆయన సామంత రాజుల నందఱిని తన ముఖ్యస్నేహితులుగ భావించెను. వారును ఆయనయెడల అమితగౌరవమును జూపిరి. తన మంత్రులసలహాలను బుచ్చుకొనక ఆయన రాజ్యాంగవ్యవహారములను పరిష్కరించుటలేదు. ఈయన్నిటికంటె మిన్నయగుసుగుణ మొకటి ఆయనయందు శోభిల్లు చుండెను, అదియే "జనాభిప్రాయమును గౌరవించుట". జనాభిప్రాయ మును ధిక్కరించి ఆయన ఎప్పుడును పరిపాలించి యుండలేదు.

నిదర్శనమును చూడుడు.

వనవాసమును గడిపి అయోధ్యానగరమునకు జనినపిమ్మట తన ప్రియభార్యయగు సీతయొక్కనడతనుగుఱించి జనులు దురభిప్రాయపడు చున్నారని తెలిసికొనినపుడు ఆయన మిక్కిలి చిన్నబుచ్చుకొనెను. తన భార్యపతివ్రతయనియు మిక్కిలిగౌరవనీయురాలనియు ఆయనకు బాగుగ తెలియును. కాని రాజగుటంబట్టియు పుత్రపౌత్రాదులకుంగూడ మార్గదర్శకుండుగ నేర్పడవలసినవాడగుటంబట్టియు, జనులయభిప్రాయము నుగౌరవించుటకుగా ఆయన తనప్రియభార్యను త్యజించెను. కొందరా యనను క్రూరుడగు భర్తయని నిందింపవచ్చును. ప్రస్తుతకాలమునందు ప్రబలియున్న అపూర్వ నవనాగరికతను బట్టి యాలోచించిన ఆయన దయగల భర్తకాకపోవచ్చును; కాని ఈకార్యమునందుగల రహస్యము ఆయనకు ప్రజాభిప్రాయమునగల అత్యున్నతగౌరవభావమై యున్నది.

సీతకంటె రామునకు ప్రియతమమైన వస్తువెద్దియు లేదు. ఆమెను తిరిగి సంపాదించుకొనుటకు లెక్కలేని కష్టముల ననుభవించెను. ఇంత దనుక ఆయనకు సంతతి లేదు. ఇప్పుడు సీత గర్భవతియై యున్నది. రాముడు తనకు గలుగబోవు పుత్త్రుని ముఖము జూచుటకు నువ్విళ్ళూరుచుండెను. ఇట్టి స్థితిగతులయందు ఎంతటి ధర్మాత్ముడైనను తన భార్యను త్యజింపగలడా! అట్లు త్యజించి తన రాజధర్మమును నెరవేర్చిన మానవుడెంతటి వాడో మీ రూహింపుడు. ప్రపంచ చరిత్రయందెచటనైనను ఇట్టి గుణములచే శోభిల్లు రాజును మీరు చూపగలరా!

ఇపుడు రాముని మార్గదర్శకుడగు భర్తగ నిరూపింతను. రాజధర్మమును నిలుపుకొనుటకు తుదకు తన భార్యను విడనాడినను ఆయన అత్యుత్తమ ప్రేమాబద్ధుడగు భర్తయైయున్నాడు. మానవధర్మమగు శౌర్యమును ప్రదర్శించి ఆయన సీతను పెండ్లాడి హృదయపూర్వకముగ ప్రేమించెను. ఇతర రాజులవలె ఆయన ద్వితీయ భార్యను గైకొనలేదు. సీతను త్యజించిన పిమ్మట రాముడు అశ్వమేధయాగమును జేయదలపెట్టెను. శాస్త్రములలో జెప్పబడిన ప్రకారము భార్య లేని భర్త యాగములను చేయ ననర్హుడు. మంత్రులును పురోహితులును రాముని ద్వితీయ భార్యను గైకొనమని బలవంత పెట్టిరి. కాని ఆయన అంగీకరింపబడలేదు. తన భార్యయొక్క ప్రతిబింబ మాయన హృదయ ఫలకము నందు చిత్రింపబడియే యుండెను. వివాహమును పవిత్రవంతమైనదానిగ ఆయన తలంచెను. పునర్వివాహమును జేసికొనుటకు ఆయన యంతరాత్మ సమ్మతింపదయ్యె. యాగమునకొఱకు సీతవిగ్రహమును బంగారముతో జేయించి సింహాసనముమీద తన ప్రక్కను బెట్టించుకొనెను. ఆయనయొక్క ఏకపత్నీవ్రతపరాయణత్వమును దీనిని బట్టి గ్రహింపనగును. ప్రజలయెడల ప్రభుత్వ జేయవలసిన పవిత్రమైన ధర్మమే ఆయనను తన భార్యను త్యజింప బలవంతపెట్టెను. అయినను ఆమె

నప్పుడును రాముఁడు మఱచి యెఱుంగఁడు; ఆవిచారము నాయనను ఎల్లప్పుడును శల్యమువలె బాధించుచునే యుండెను.

లక్ష్మణ, భరత పాత్రలయందు వాల్మీకి సోదరధర్మముల నన్నిటిని పూర్తిగవర్ణించెను. ప్రపంచ వాఙ్మయమునం దెచటను ఇట్టి విరాగులును, భక్తులును అగుసోదరులు లేరు. ఈపాత్రద్వయమును కల్పించిన వాల్మీకి బుద్ధిచాతుర్యము నూహింపనెవ్వరితరము? ప్రళయకాలము సంభవించువఱకును భరతవర్షీయుల వాఙ్మయమునందలి తేజమును వెదఁజల్లుచు నుండును. రాముని అరణ్యావాసవార్త లక్ష్మణుఁడు వినినవెంటనే తానుకూడ ఆయనతో వచ్చెదనని చెప్పెను.

లక్ష్మణునికోరికను రాముఁడు నిరాకరింపఁజాలక తుదకుతనతో వచ్చుటకు సమ్మతించెను. ఈఅరణ్యావాసకథనంతను జూచిన లక్ష్మణుని నిర్మలభక్తి విశదమగుచున్నది. లక్ష్మణుడు పదునాల్గు సంవత్సరముల పర్యంతము స్త్రీముఖమును జూడక, కష్టములను లెక్కజేయక తదేకధ్యానపరాయణచిత్తుఁడై సోదరసేవను సల్పెను.

భరతుఁడుకూడ ఇట్టి ఉత్తమగుణములకు గొఱతవడియుండలేదు. తండ్రి చనిపోయినపిమ్మట ఆయన అయోధ్యానగరమునకు తిరిగివచ్చిన తరువాత తానులేని సమయమునందు జరిగినసంగతుల నన్నిటిని తెలిసికొనినవాఁడై దీనికంతకును కారకురాలగు తనతల్లిని నిందించి రాముని తిరిగితెచ్చుటకు బయలుదేరిపోయెను. ఈసోదరులిద్దఱును కలిసికొనినపుడు జరిగినసంభాషణ అత్యంతప్రేమ పూరితమైయుండెను. అయోధ్యకు తిరిగివచ్చి రాజ్యమునుపాలింపుమని రాముని భరతుఁడు బలవంతపెట్టెను. కాని రాముఁడు తనవాగ్దానమునకు భిన్నముగా నడువజాలనని చెప్పెను. తుదకు తనప్రతినిధిగ రాజ్యము నేలుమని భరతుని నాజ్ఞాపించెను. భరతుడు రామునిపాదుకలను సింహాసనముమీఁద బెట్టితాను ప్రతినిధిగ రాజ్యమును పరిపాలించెను. ఎంతమందిరాజు లిట్లుతమ రాజ్యములను త్యజింపఁగలరు? ఇంతకంటె ఘనమైన స్వార్థత్యాగముగలదా?

# ధర్మశాస్త్రములను మార్చవలయునా?

"సాత్త్వికా విపరీతాశ్చేత్ రాక్షసా ఏవ కేవలమ్"

ఇప్పుడు సంఘాభిమానులలో కొందఱు భారతీయత్వము, సనాతనధర్మము అను పదములందు ప్రేమగలవారలయ్యును సనాతనధర్మబోధకములగు ధర్మశాస్త్రములందు ఇప్పుడు ఆచరింపవీలులేని యసందర్భము లెన్నియో కలవనియు, ప్రకృతిశాస్త్రపరిజ్ఞానబలముచేత క్రొత్తక్రొత్త విషయము లెన్నియో బయలువెడలుచుండఁగా బాల్యదశయందలి నిర్ణయములనే మనము ఇంకను అనుష్ఠించుచుండవలయునా? అనియు అనుచున్నారు. మఱికొందఱు ప్రాచీనధర్మము లాచరణీయములు కాఁజాలవనుటకు కారణము లిటులు తెలుపుచున్నారు :—

౧. ఒకస్నానవిధిని చూడుఁడు. అది నదియందుతప్ప రెండవచోట స్నానమొనర్చిన నిందింపఁబడియున్నదిగదా; అది సాధ్యమా?

౨. వేదశాస్త్రములు సమగ్రముగ చదివినఁగాని బ్రాహ్మణుఁడనఁదగఁడుగదా; అట్టి బ్రాహ్మణు లిప్పుడు ఎందఱున్నారు?

3. ఈ యుద్యోగములు చేయువారును, వ్యవసాయముచేయువారును బ్రాహ్మణులేనా?

౪. వేయింటికి ఒకరైనను వెనుకటిశాస్త్రములప్రకారము నడువఁజాలనప్పుడు అట్టి ధర్మశాస్త్రములనే పట్టుకొని పాకులాడవలసిన యవసరమేమి?

అనియు, మఱియు పరిపరివిధములుగను పలుకుచున్నారు.

జనసామాన్యముయొక్క యోగక్షేమములకు సంబంధించిన ఈగొప్పవిషయమునుగూర్చి ధర్మశాస్త్రకారులు తత్తుల్యులు తద్వ్యాఖ్యాతలును అగు విద్యారణ్యాదిశిష్టులున్ను ఏఅభిప్రాయముకలిగియున్నారో అదియు క్రమముగ నిందు విచారింపఁబడును. ఇంకొకచిత్రము చూడుఁడు. 'ధర్మశాస్త్రములు మార్చవలయు'నని వాదించువారును అభిప్రాయములిచ్చువారును ఇప్పటివఱకు ఆశాస్త్రములందు చెప్పిన

విధముగ చరించుచున్నవారుమాత్రము కారు. ఇఁక నేమన తమతమ యిష్టానుసారము చరింప మొదలుపెట్టినవారును, అట్టివారి ప్రాపకమున కీర్తిలాభముల గడింపఁదలఁచినవారలును మాత్రమే ధర్మశాస్త్రముల మార్చవలయునని ఇట్టిపలుకు పలుకుచున్నారు.

ఈకష్టకాలమునందును శ్రమయనక ఓర్పుతో తమతమవర్ణాశ్రమములకు విధించిన విధులను ఆచరించుచుండువారలలో ఒకరైనను ఈకాలానుసారము శాస్త్రములమార్చవలయునని వాదించుటయే లేదు.

## స్వేచ్ఛాచారులిందులకుచేసిన ప్రయత్నములు.

౧. మొట్టమొదట మనమతాచారవిధులందును, వానిని బోధించు వేదశాస్త్రములందును జనులకున్న గౌరవమును పోఁగొట్టు బోధలను చేసిరి.

౨. అంతమాత్రమున తమయుద్దేశములు నెరవేరకపోవుటచేత ఆత్మగౌరవమునుసైతము వదలి మతాంతరులగు పాలకులు మతవిషయములందు ప్రవేశింపమని చెప్పుచున్నను మనవారలే అచటఁజేరి మతాచారవిఘాతుకములగు శాసనములఁ గొన్నింటిని పుట్టించిరి.

3. దీనివలనసైతము తమయుద్దేశము పూర్తిగ నెరవేరకపోవుటయు మతాచారవిఘాతుక శాసనములను పలువురు అనుసరింపకపోవుటయుఁ గాంచినవారలయి మీరు శాస్త్రానుసారము చరించుచున్న పరిపాలకులు మీకు స్వరాజ్యము నొసంగరనియు, కావున ఆప్రకారము చరింపకుఁడనియు బోధింపఁ జొచ్చిరి.

౪. ప్రకృతమున దానిచేతసైతము జనులు పలువురు స్వేచ్ఛాచారులపలుకులందు గౌరవమును ఎక్కుడుగాఁ గనంబఱచకపోవుటచేత మేము సూచించు మార్పులు మాస్వకపోలకల్పితములు కావనియు, మీవేదశాస్త్రములే అంగీకరించియున్నవనియు బోధింప మొదలుపెట్టినారు.

వెనుకటి మూఁడుఉపాయములకును ప్రయత్నించినవారికి మన శాస్త్రములందు ఎక్కువప్రవేశము లేకపోవుటచేత జనులు వారిమాటలయందనాదరమును చూపిరి. ఇంద్రియచాపల్యము నరికట్టఁజాలని

స్వేచ్ఛాశీలురలో కొందఱుమాత్రమే వారియుపదేశము ననుసరించిరి. ఈనాల్గవపర్యాయము మాత్రము మన వేదశాస్త్రములను చదివినట్టి వారిప్రాపకముకొని వారిచేత తాము సంఘమునందు వ్యాప్తింపఁదలఁచినట్టియు, వ్యాప్తించినట్టియు దురాచారములు శాస్త్రీయము లేయనియు, అందులకు ధర్మశాస్త్రములు ముఖ్యముగ నవి అంగీకారమును చూపుచున్నవనియు, వేదములే స్వయముగ మాసిద్ధాంతముల నంగీకరించుచున్నవనియు అజ్ఞానవశముచేత మీరు ఆవిషయము నెఱుంగఁజాలకున్నారనియు బోధించుచున్నారు. ఈ రవ ఉపాయముచేత వేదశాస్త్రవిశ్వాసము కలిగియున్నను, ఎదుటివారిబోధ సద్బోధయో దుర్బోధయో అని గ్రహించునంతటి సామర్థ్యము లేనివారలే అధిక సంఖ్యగలవారుండుట సహజము కావున వారు మోసపోవచ్చును. కనుక ఈనాల్గవపక్షమువారి వచనములను కొంత విమర్శింపఁదలఁచితిని.

మొత్తముమీఁదచూడఁ గలిపురుషునియొక్క ప్రభావమంతయు ధర్మమార్గమునకు ఆటంకమును కలుగఁజేయుటయందే ఎక్కువ యనుకూలముగఁ గనంబడుచున్నది. దురాచారపరులకు కామధేనువనఁదగు ఇట్టి కలికాలమున కలిపురుష ప్రోత్సాహమువలన సదాచారమార్గము ప్రవృద్ధినందుట దుర్ఘటమయినను మేము

శ్లో॥ ధర్మకార్యే యతన్ శక్త్యా నచేత్ప్రాప్నోతి మానవః ।
ప్రాప్తో భవతి యత్పుణ్యం తస్య మే నిశ్చితా మతిః ॥

అర్థ—మనుష్యుఁడు తనశక్తికొలఁది ధర్మకార్యాభివృద్ధికయి ప్రయత్నించియు ఆధర్మకార్యమును దైవవశముచేత సాధింపఁజాలకపోయినను ఆ ప్రయత్నించిన వానికి మాత్రము కార్యము సానుకూలమయిన ఎట్టి పుణ్యము లభించునో అట్టి పుణ్యము ( కార్యము సానుకూలము కాకపోయినను ) కలిగితీరునని నాదృఢాభిప్రాయము.

అను శ్రీకృష్ణభగవానుని వాక్యము ననుసరించి యథాశక్తి ప్రయత్నించుచున్నారము.

శ్లో॥ రాక్షసాః కలి మాశ్రిత్య జాయంతే బ్రహ్మయోనిషు ।
బ్రాహ్మణానేవ బాధంతే తత్రాపి శ్రోత్రియాన్ కృశాన్ ॥

అర్థ—వేదశాస్త్రమార్గద్వేషము గల రాక్షసులు కలికాలము నందు బ్రాహ్మణులయి జన్మించి తమకుఁ గల బ్రాహ్మణ్యద్వేషము చేత బ్రాహ్మణులనే పీడింతురు. అందులోను వేదశాస్త్రాచార పరాయణులగు శ్రోత్రియులను మిక్కిలి పీడింతురు.

అని ప్రాచీనులు పలికియున్నారు కావున, జాగ్రత్తగా తమ తమవర్ణాశ్రమధర్మములను శక్త్యనుసారము భారతీయు లనుసరించి తమ యార్యత్వమును కాపాడుకొందురుగాత, మేము సక్రమముగ శాస్త్రములందు చెప్పినవిధులను ముఖ్యకల్పము, అనుకల్పము అను పేరబోధించినవానిని జత్తగించుచుఁడు.

## — స్నానము. —

ఇదివఱకు ప్రాతఃకాలమున బ్రాహ్మముహూర్తమున మేల్కొనుటనుగూర్చియు సంకల్పమునుగూర్చియు వ్రాసియుంటిమి. ఈసంచిక యందు ప్రాతఃకాల స్నానమునుగూర్చి వ్రాయుచున్నారము.

మతాంతరుల విపరీతపు ఆచారములకు అలవాటుపడినవారును మనగ్రంథములను చూడనివారలును, చూచియు మతాంతరుల వలన గౌరవమునో లేక ధనమునో అపేక్షించువారలును అగు కొందఱు మహానుభావులు శాస్త్రజ్ఞానములేని సాధారణుల మోసపుచ్చుటకయి ఈక్రిందిమాటలు చెప్పుచున్నారు:—అవి ఏవనఁగా:—

"మనశాస్త్రములందు చెప్పినమాటలన్నియు న్యాయ్యములును, ఇహపరసుఖమును కలుగఁజేయునవియు అగుట సత్యమే, కాని కాలమెప్పుడును ఒకేవిధముగనుండదు. ఇప్పటిపరిస్థితులు వేఱు, ఈకాలము వేఱు. ఆశాస్త్రములందు చెప్పినరీతిగ నడుచుటకు మనకు సాధ్యముకాదు. మనపూర్వులగు మహర్షులందరును అరణ్యములందు నదీతీరములందున్నారు కనుక దానికితగినట్లు వారు ఆ నియమములను కల్పించుకొనిరి. మనకు సాధ్యమగునా? సాధ్యముకాదని తెలిసియు మరల దానినే పదేపదే చెప్పుకొనుచున్నలాభమేమి? కనుక మనమందరము మనవీలు ననుసరించి కొన్ని ఏర్పాటులుచేసికొని ఆప్రకారము చరింతము" అని ఆమహాత్ముల పలుకులయొక్క సార మయియున్నది.

ధర్మమును మనయిష్టము వచ్చినరీతిగ మార్చుకొనవచ్చును అని ఏధర్మశాస్త్రమునందును లేదు. త్రికాలజ్ఞులు అగు మహర్షులు తపశ్శక్తిచేత వేదార్థమును స్వయముగ అవగాహనము చేసికొన్న వారలయి వేదములందు బీజరూపముగ బోధింపఁబడియున్న ధర్మములను, విపులముగ స్మృతులనుపేర రచించి లోకమున వ్యాపింపఁజేసిరి. మహర్షులు త్రికాలజ్ఞులు కావునను వేదశాస్త్ర విశ్వాసము గలవారలకు దైవికాది ప్రతిబంధకములవలన కొన్నినియమములను జనులు ఆచరించుటకు వలనుపడదేమో యనియు వారు యోజించిన వారలయి తాము చెప్పిన ప్రతికృత్యమునకు ముఖ్యకల్పము, అనుకల్పము అనుపేర ద్వివిధముగ విధులను సూచించిరి. స్నాన, సంధ్యావందన, ఔపాసన, వైశ్వదేవ, దేవతార్చనాదులగు నిత్యకర్మములందును, వివాహోపనయనాది గృహ్యకర్మములందును, సదాచారనిష్ఠాగరిష్ఠులగు బ్రాహ్మణులు తమతమ జీవికను ధర్మశాస్త్రములకు అవిరుద్ధముగ ఈ కాలమునందుకూడ ఎటులు చేసికొనవచ్చునో ఆరీతులన్నియు వివరముగ బోధించియేయున్నారు.

మహర్షితుల్యులగు శ్రీవిద్యారణ్యాది బ్రహ్మవిద్యావరిష్ఠులు ఆయాస్మృతిగ్రంథములను ఆమూలాగ్రముగ పరిశీలించి మీమాంసాన్యాయ సమ్మతముగ తదర్థమును స్పష్టముగ తెలిపియున్నారు.

అలసత్వము, ఇంద్రియచాపల్యము, ఏదోవిధముగ అందఱిచేత మెప్పును పొందవలయునను పిచ్చియూహాలు లేక ఆస్తిక్యబుద్ధియు, ధర్మాచరణాసక్తి మున్నగు సదూహాలు కలవారికి ఇట్టి కష్టకాలము సందేకాదు ఇంతకంటె నూఱంతలు కష్టమయిన కాలమునందును బ్రాహ్మణాదివర్ణములవారు ప్రాచీనధర్మశాస్త్రముల నతిక్రమింపక చరింపవచ్చును. వారివారి పరిస్థితుల ననుసరించి ముఖ్యకల్పానుసారముగ చరించుటకు తగిన పరిస్థితులు కలిగియుండునేని ముఖ్యకల్పము ననుసరించి చరించి అట్టిజీవికను గైకొనియుండవచ్చును లేదా ముఖ్యకల్పకమునకు తగనియెడల అనుకల్పముప్రకారము చరింపవచ్చును. నడచుటకు ముఖ్యకల్పప్రకారము తగిన అవకాశములు

కలవాఁడు అనుకల్పముప్రకారము నడచినవాఁ డాచరించినది. వ్యర్థమగుటయేగాక మీఁదు మిక్కిలి వానికి అధోగతియు కలుగును. ముఖ్యకల్పప్రకారము నడచుటకు శక్తిలేనివాఁడు అనుకల్పము ప్రకారము చరించినయెడల వానికి ముఖ్యకల్పముగా చేసిన ఎట్టి పుణ్యమో అట్టిపుణ్యమే అనుకల్పముగా ఆచరించినను కలుగును. ఈవిషయము సకలశ్రౌతస్మార్తకర్మములకును సమానమే. ఇప్పుడు స్నానమునకు ముఖ్యకల్పమును వ్రాయుచున్నాము. తర్వాత ఆస్నానమునకు అనుకల్పమునుగూర్చియు వ్రాసెదము. దీనివలన మహర్షులకు మనయందెట్టి యాదరాతిశయముగలదో వారు త్రికాలజ్ఞులగునో కాదో మీరే తెలిసికొనఁగలరు. గ్రంథవిస్తరభీతిచేత ప్రమాణభూతములగు సంస్కృతశ్లోకములను వ్రాయక కేవలము తాత్పర్యమునే వ్రాసెదను.

౧. ధర్మశాస్త్రములన్నిటియందును ప్రాతఃకాలమున అరుణోదయ కాలమునందు చన్నీళ్ళయందు స్నానముచేయువానికి మంచి తేజము, రూపము, బలము, శుచిత్వము, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి దుస్స్వప్ననాశము, మేథావృద్ధి, తపస్సామర్థ్యము, జాగరూకత, మున్నగు ఇహలోకమునందు దృష్టఫలములున్నూ, సప్తజన్మములందు చేసిన పాపములన్నియు నశించుననని అదృష్టఫలమున్నూ యోగియాజ్ఞవల్క్యుఁడు దక్షుఁడు మున్నగు మహర్షు లభిప్రాయ మిచ్చియున్నారు.

౨. స్నానమునుచేయక సంధ్యనుగాని, జపమునుగాని, హోమమును గాని దేనినిన్నీ చేయకూడదు. ఈదేహము నవచ్ఛిద్రముల తోకూడి ఎల్లప్పుడు తత్తదవయవములనుండి మలమును వదలుచు మలినముగనుండును. కావున స్నానముచేయక ఈదేహముతో ఎట్టి కర్మముచేయుట యుక్తముకాదు. కనుక స్నానముచేసియే సంధ్యాది కర్మములను చేయవలయును.

3. నీటియందు మునిఁగినంతమాత్రమున స్నానఫలము కలుగఁజాలదు. సంకల్పము, మార్జనము, సూక్తపఠనము మున్నగునవి చేయుచు స్నానానంతరము దేవర్షి పితృతర్పణముచేసిననే అది స్నానమనంబడునుగాని ఊరక నీటియందు మునిఁగినయెడల స్నానమసం

బడదు. ఆనీటియందలి కప్పలు మొదలగు జలచరములకు ఎంత పుణ్యమో వీనికిన్ని అంతయే పుణ్యము.

౪. స్నానమును నదులందుఁగాని నదములందుఁగాని, దేవఖాత ములగు గొప్పగొప్ప తటాకములందుఁగాని కొండవాగులయందుఁగాని చేయుట ముఖ్యము.

౫. అట్టివి దొరకనప్పుడు తాను త్రవ్వించిన బావియందు జలము తోడుకొని స్నానము చేయవలయును.

౬. ఇతరులు త్రవ్వించిన తటాకాదికములందు స్నానముచేయ వలసి వచ్చినయెడల తానుకూడ మరల ౪, ౫ మృత్పిండములు వానినుండి తీసి వెలుపలవైచి, స్నానము చేయవలయును. తాను ఇత రులు త్రవ్వించినదానినుండి శక్తికొలఁదిని మృత్పిండములను తీసివేయక స్నానముచేయు నెడల తనకు స్నానఫలము కలుగదు సరిగదా మీఁదు మిక్కిలి ఆ తటాకాదికమును త్రవ్వించినవాఁడు చేసిన పాపముకూడ స్నానము చేసినవానికి అంటును.

౭. నదులున్నప్పుడు వానిని వదలి చెరువు మున్నగు చోటుల స్నానముచేయఁగూడదు. అధిక జలముగల చెరువు మున్నగునవి ఉన్న ప్పుడు అల్పోదకముగల కుంటమున్నగు జలాశయములందు స్నానము చేసినయెడల స్నానఫలము కలుగదు. మీఁదుమిక్కిలి పాపముకలుగును.

౮. జ్వరమున్నగునవి సంభవించి అశక్తుఁడయియున్నప్పుడు వేఁడినీళ్ళతో స్నానముచేయవచ్చును. అట్టి ప్రతిబంధకము ననుస రించి కంఠస్నానమునైనను చేయవచ్చును.

ఉష్ణోదకముచేత కంఠస్నానముకూడ చేయుటకు వీలుపడనంత అశక్తుఁడయినప్పుడు బొడ్డులోఁతున నీళ్ళలోదిగిగాని లేక నాభివఱకుఁ గాని స్నానముచేయవలయును. అందుకు శక్తిలేనప్పుడు కటిపర్యం తము ప్రక్షాళనముగాని చేసికొనవలయును. అందులకుకూడ శక్తి చాలనివాఁడు ఈక్రింది స్నానములలో దేనినైనను చేయవచ్చును:—

గౌణస్నానములు.

౧. కాపిలస్నానము, ౨. ఆగ్నేయస్నానము, ౩. వాయవ్య

స్నానము, ౪. మానసస్నానము, ౫. సారస్వతస్నానము, ౬. బ్రాహ్మ స్నానము, అని షడ్విధగౌణస్నానములు గలవు.

వీని వివరము.

౧. కాపిలస్నానము = తడిగుడ్డతో దేహమంతయు తుడుచుకొనుట.

౨. ఆగ్నేయస్నానము = ఔపాసనాగ్నియందలి భస్మమును గ్రహించి ఈశానాది మంత్రములచేత శిరస్సు, ముఖము, హృదయము, మొదలగు అవయవములకు ఆభస్మమును పూసికొనుట.

3. వాయవ్యస్నానము = గోవులయొక్క డెక్కలచేత లేచిన దుమ్మునందు నిలంబడుట. ఎండయందు వర్షించుచుండఁగా తాను అచట నిలుచుండి స్నానముచేయుట.

౪. మానసస్నానము = మనస్సుచేత పరమేశ్వరుని తలంచుట. దీనినే కొందఱు యౌగికస్నానమనియు చెప్పెదరు.

౫. సారస్వతస్నానము=విద్వాంసులచేత స్నాతుఁడవయితివని అనుగ్రహింపఁ బడుట.

౬. బ్రాహ్మస్నానము=ఆపోహిష్ఠాది మంత్రముల పఠించుచు కుశలచేతను ప్రోక్షించుకొనుట.

ఆయాయవకాశము ననుసరించి ఈగౌణస్నానములలో దేనినైనను ఆచరించినయెడల స్నానఫలము కలుగును.

వేదశాస్త్ర విశ్వాసముకలిగి ఆస్తిక్యబుద్ధి యొక్కటి కలిగియున్నయెడల సనాతనధర్మ గ్రంథములందు విధింపఁబడిన విధానములన్నియు అందఱకును అన్నికాలములందును ఆచరించుటకు యోగ్యములుగానే యున్నవనియు,అట్టిధర్మములనునిర్ణయించుటకు శ్రుతిస్మృతి ధర్మమార్గదూరులయి స్వేచ్ఛాచారులయి పరుల ప్రోత్సాహమున చేతికివచ్చినటుల వ్రాయునట్టి ధర్మజ్ఞంమన్యులు శ్రమపడనక్కఱ లేదనియు ఈ మహానుభావులు తాము ధర్మజ్ఞులమనియు, తమకు తోఁచినసలహాలు ధర్మజ్ఞసమయములనియు, వానిని ఇతరు లందఱును అంగీకరించి తీరవలయుననియు శాసించుట అనావశ్యకమనియు విన్నవించుచున్నారము.

## —॥ అంటరాని వాళ్ళు ॥—

రాజమహేంద్రవరపుర నిమ్నజాత్యుద్ధరణ సంఘమువారగు పాలకోడేటి గురుమూర్తిగారును దల్లాప్రగడ ప్రకాశరాయఁడుగారును "నంటరాని వాళ్ళు" యను శీర్షికగల యొక కరపత్రి మచ్చుటచ్చుటం బంచిపెట్టించుచున్నవారు. వీరి కాఁబోలు "శివరాత్రి దినములలో రాజమండ్రియందలి కోటిలింగక్షేత్రముననున్న శివాలయమునకు పంచములు పెక్కుమంది జాతీయగీతములను పాడుచు వచ్చిరి. వారు నిరభ్యంతరముగ లోనికిపోయిరి. వారు పంచములని యెరిగియుండియు బూజారి పూజాపాదుకలను (శఠకోపము) వారి తలపైనుంచెను, వారు స్వామికి ఫలపుష్పాదుల నర్పించిరి. అచటచేరియున్న వేలకొలది యాత్రికులందరును బ్రాహ్మణులును గూడ నందుల కంగీకరించిరి. ఇతర దేవాలయములలోనికిగూడ వారిని రానిత్తురని తోచుచున్నది" యని 1922 వ సం॥ మార్చి 3 వ తేది యాంధ్రపత్రికలోఁ బ్రకటింపించియున్నవారు. ఇదివఱకీ యస్పృశ్యతాదోష ముండఁబట్టియే మన మింగ్లీషువారి పరిపాలనములోఁ జిక్కికొని యస్వతంత్రులమై స్వారాజ్యమును బడయఁజాలకుంటిమి. గోదావరీతీరస్థమగు కోటిలింగేశ్వరాలయము లోపలికే నిరభ్యంతరముగాఁ బంచములు పోయియుండఁగను బంచములని యెఱిఁగియుండియుఁ బూజారి వారినెత్తిని రుద్రపాదములు పెట్టక శఠకోపము పెట్టియుండఁగను వారు స్వామికి ఫలపుష్పాదు లర్పించియుండఁగను నచటనున్న వేల కొలంది యాత్రికులేకాక బ్రాహ్మణులుకూడ నందుల కంగీకరించియుండఁగను నిఁకమీఁద నితర దేవాలయములలోపలికిఁగూడ వారిని రానిత్తురని మన నిమ్నజాత్యుద్ధరణ సంఘమువారికిఁ దోఁచుచుండఁగను నింకను స్వారాజ్యము వచ్చుటకభ్యంతర మేమియున్నది! అది వచ్చిపోయినదే. ఒక ఫలపుష్పాదులతో

యర్పించుకొలరు? తమ్ము నుద్ధరించుటకుఁగా నిట్టి సంఘముతో బయలు దేరినవు డభిషేకములు చేసినను మాత్రము నొప్పింపము. గొట్టువా రెవరు? ఆహా! లోక మెంతపిచ్చిపోకను బోవుచున్నది! ఎంతెంత మేధావుల కెట్టి తప్పుటూహాలు గలుగుచున్నవి. ఉన్నవన్నియు నుండఁగా స్వరాజ్యసంపాదనమున కంటరానితన మడుగంటించుటయా ప్రధాన సాధనము?

"అంటరాని వాళ్ళు" యను శీర్షికగల మనవారి కరపత్రి మొక్కింత పరిశీలింతము. ప్రథమ మంటరానివాళ్ళ వాక్యార్థ మెందును బోధపడకున్నయది. వాళ్ళకుఁ జెప్పవలవా ళ్ళర్థముకాని వారలు కారు. దీనితో వీరికున్న భాషాజ్ఞానము స్పష్టపడియెడిని. ఆంధ్రభాషాజ్ఞానమే యిట్టులున్నప్పుడు సంస్కృతభాషాజ్ఞాన మంతకన్నను విలుప్తమయియే యుండవచ్చును. ధర్మశాస్త్రములన్నియు నీదద్భావలో నేకస్పష్టము. కూర్మపురాణమందలి యీ వాక్యము జూడుఁడు. శ్లో॥ చండాలపతితాదీంస్తు కామాద్య స్సంస్పృశే ద్ద్విజః, ఉచ్ఛిష్ట స్తత్ర కుర్వీత ప్రాజాపత్యం విశుద్ధయే॥ చండాలాదులను గావలెనని స్పృశించిన ద్విజుఁ డుచ్ఛిష్టుఁడనియు నతఁడు ప్రాజాపత్యమను ప్రాయశ్చిత్తమునఁగాని శుద్ధుఁడు కాఁడనియు దీనియర్థము. స్మృతిరత్నము "ఛాయాం మంత్యశ్వపాకాదే స్స్పృష్ట్వా స్నానం సమాచరే"త్తను శ్లోకముచేఁ జండాలుర నీడను ద్రొక్కిననే స్నానమొనరింప వలెనని చెప్పుచున్నది. శ్లో॥ దృష్ట్వైవ క్యాశ్వచండాలాన్ పతితలోమాం స్తథానుజాన్, భుంజానో మద్గిరన్ భుక్తం త్రిరాత్రో దేకతస్య చి॥ ఉదక్యామథ చండాల గ్రామసూకరకుక్కుటాన్, భుక్త్వంతరే సమీక్ష్యైతాన్ జపే త్పూర్వోదితా మృచం, హోమే దానేచ యాగేచ యద్దేభి రవలోకితం, దైవే కర్మణి పిత్ర్యేచ తత్సర్వం పరివర్జయేత్॥ అను వాక్యములచే ముట్టుదానిని మాదిగవానిని సంకరుని జూచుచు భుజించిన భుక్తాన్నమును

వెళ్ళఁగ్రిక్కుక యున్నవాఁడు త్రిరాత్రోపవాసముచేతను వెళ్ళఁగ్రిక్కు-నవాఁ డేకరాత్రోపవాసముచేతను శుద్ధుఁడగునని యు రజస్వలను చండాలుని గ్రామసూకరమును కుక్కుటమును భోజనకాలమునఁ జూచినచో మానస్తోకమనుఋక్కును జపింపవలెననియు "హోమ దానయాగకాలంబులయందును దేవపితృకార్యంబులయందును దదప లోకితమైన పదార్థములఁ ద్యజింపవలెననియు సంవర్తుఁడును "చండాలం పతితం ప్రేతం శ్వశూద్రాదీన్ రజస్వలాం ఏతాన్ నిరీక్ష్య భుంజన్ హి వమి త్వోపవసే త్ర్యహం" మనుశ్లోకముచేఁ జండాల పతిత ప్రేత శ్వ శూద్రాదులను రజస్వలను జూచుచుఁ గుడిచిన వాఁడు వమనముచేసికొని మూఁడుదినము లుపవసింపవలెనని హారీతుఁడును నుడివియున్నవారు. దిఙ్మాత్ర ముదాహరించితిమి కాని యిట్టి మహాఋషుల వాక్యములు వేనవేలు గలవు. ఏకాలమునాఁటివారో యైన యాఋషుల వాక్యము లీకాలమున కనుపయోగములు గావునఁ గాలమునుబట్టి ప్రకృతాచారముల మార్చుకొనవలెనని మన నవనాగరికులు చెప్పుదురు. ఆమహర్షు లేకాలపువారైనను భూతభవిష్యద్వర్తమానములగు నన్నికాలముల స్థితిగతులును దెలిసికొనఁ గలిగియుండిరి. కృత త్రేతా ద్వాపరయుగస్థులగు తన్మనులు చతుర్యుగస్వరూపముం గూడ నెట్లు కనిపెట్టఁగలిగిరో యీదిగువ నుదాహృతంబగు నొక్క యాఖ్యానముం దిలకింపుఁడు.

స్కాందమహాపురాణము-నాగరఖండము ౧౭ వ యధ్యాయము

## చతుర్యుగ స్వరూపము.

ఋషయ ఊచుః॥ చతుర్యుగస్వరూపంతు మాహాత్మ్యం చైవ సూతజ। ప్రమాణం వద కార్త్స్న్యేన పరం కౌతూహలం హి నః॥ సూత ఉవాచ॥ ఇమ మర్థం పురా పృష్టో వ్యాసదేవ బృహస్పతిః॥ యథా ప్రోవాచ విప్రేం

దాని స్తథావక్ష్యామి సాంప్రతం॥ పురా శక్రం సమాసీనం సభాయాం త్రిదశైస్సహ। సహశచ్యా సమాసీన ముపాసాంచక్రిరే సురాః॥ గంధర్వాప్సరసశ్చైవ సిద్ధవిద్యాధరాశ్చ యే। గుహ్యకాః కిన్నరా దైత్యా రాక్షసా ఉరగాస్తథా॥ కలాః కాష్ఠా నిమేషాశ్చ నక్షత్రాణి గ్రహాస్తథా। సాంగావేదా స్తథా మూర్తా స్తీర్థా న్యాయతనాని చ॥ తథా చక్రుః కథాశ్చిత్రా దేవదానవరక్షసాం। రాజర్షీణాం పురాణానాం బ్రహ్మర్షీణాం విశేషతః॥ కస్మింశ్చిదథ సంప్రాప్తే ప్రస్తావే త్రిదశేశ్వరః। పప్రచ్ఛ వినయోపేతో విప్రశ్రేష్ఠం బృహస్పతిం॥ భగవన్ శ్రోతు మిచ్ఛామి ప్రమాణం యుగసంభవం। మాహాత్మ్యంచ స్వరూపంచ యథావ ద్వక్తుమర్హసి॥ బృహస్పతిరువాచ॥ అహం తే కీర్తయిష్యామి మాహాత్మ్యం యుగసంభవం। యత్ప్రమాణం స్వరూపంచ శ్రుణుష్వావహితస్థితః॥ అష్టావింశతిసహస్రాణి లక్షా స్సప్తదశైవతు। ప్రమాణేన కృతంప్రోక్తం యత్ర శుక్లో జనార్దనః॥ చతుష్పాద స్తథా ధర్మ స్సుసంపూర్ణా వసుంధరా। కామక్రోధవినిర్ముక్తా భయద్వేష వివర్జితాః॥ జనా శ్చిరాయుష స్తత్ర శాంతాత్మానో జితేంద్రియాః। పంచతాళప్రమాణాశ్చ దీప్తిమంతో బహుశ్రుతాః॥ తత్ర షోడశసాహస్రం బాలత్వం జాయతే నృణాం। తతశ్చ యౌవనం ప్రోక్తం ద్వాత్రింశ ద్వ్యబ్దదేవహి॥ తతఃపరంచ వార్ధక్యం శనై స్సంజాయతేనృణాం। లక్షాంతే పరమం యావ దన్యేష్వా మధికంక్వచిత్॥ తత్ర సత్వాశ్చ యే కేచి త్పశవః పక్షిణో మృగాః। దైవీంవాచం ప్రజల్పంతి నవిరోధం వ్రజంతిచ॥ క్రీడంతి నకులై స్సర్పా బిడాలా మూషకై స్సమం। పంచాననై ర్మృగా నిత్య ములూకాశ్చాపి వాయసైః। అకృష్టాచ మహీ సస్యం జనయ త్యతిభూరిశః। వ్రీహిముద్గయవప్రాయం సుస్వాదు బలవృద్ధిదం॥ సర్వర్తుఫలినో వృక్షా స్సపుష్పఫలధారిణః॥ సుపత్రాః కంటకై ర్హీనాః కల్పపాదపసన్నిభాః॥ ధేన

వశ్చ ప్రయచ్ఛంతి వాంఛితం స్వాదు సత్పయః। సర్వేష్వపిహి కాలేషు భూరిసర్పిః పరిదం నృణాం॥ నతత్ర విధవా నారీ జాయతే నచదుర్భగా। కాకవంధ్యా సుతైర్హీనా నచ శీలవివర్జితా। యథాజన్మ తథామృత్యుః క్రమాత్సంజాయతే నృణాం। నహీక్షతే పితా పుత్రం మృతం క్వాపి కదాచన॥ నప్రేతత్వంచ లోకానాం మృతానాం తత్రజాయతే। నచాపి నరకే వాసో నచ రోగవ్యథా క్వచిత్॥ వేదాంతగా ద్విజాస్సర్వే నిత్యం స్వాధ్యాయశీలినః। వేదవ్యాఖ్యానసంహృష్టా బ్రహ్మజ్ఞానవిచక్షణాః॥ క్షత్రియాశ్చాపి భూపాల మేకంకృత్వా సుభక్తితః। తదావేశా త్ప్రభుంజంతి మహీం ధర్మేణ నిత్యశః॥ వైశ్యా వైశ్యజనార్హాణి చక్రుః కర్మాణి భూరిశః। పశుపాలనపూర్వాణి క్రయవిక్రయజానిచ॥ ముక్త్వైకాం ద్విజశుశ్రూషాం నశూద్రా స్తత్రచక్రిరే కించిత్కర్మ సురశ్రేష్ఠ శ్రద్ధయా పరయాయుతాః। నతత్రచాంత్యజోజజ్ఞే నచ సంకరసంభవః। నాపవిత్రో నవర్ణానాం పంచమో దృశ్యతే భువి॥ యజనం యాజనం దానం వ్రతం నియమమేవచ। తీర్థయాత్రాం నరా స్తత్ర నిష్కామా ఏవకుర్వతే॥ ఏవంవిధం సహస్రాక్ష మయా తే పరికీర్తితం। ఆద్యం కృతయుగం పుణ్యం సర్వలోక సుఖావహం॥

ఇక్కడికిఁ గృతయుగస్వరూపము ప్రకటీకృతము. ఇయ్యది గీర్వాణభాషయం దున్నందువలనఁ దద్భాషావిదులకే విదితమయ్యెడిని గాని యందఱికిని గానేరదు. కావున నీశ్లోకములయందలి యర్థమును విస్పష్ట మొనరించెడు పద్యముల నిదిగువఁ బ్రచురింతును. ఒక్క కృతయుగస్వరూపమును దెలుపుపద్యములనే కాక యవశిష్ట యుగత్రయస్వరూప బోధకములగు పద్యములఁగూడ నుదాహరింతును. చదువరులకుఁ బ్రామాణ్యబుద్ధి గలుగుటకయి ఋషిప్రోక్తములగు నీశ్లోకములుదాహృతములు. మూలము నతిక్రమించకుండ నేతత్పురాణము నాచేతనే యాంధ్రీకృతం బగుచున్నయది. ఇం దనేక ధర్మరహస్యములు

వెలువరింబడియున్నవి. కావున గ్రంథవిస్తరభీతిని సంస్కృతము నుదాహరింపక వలయుపట్ల నాంధ్రీకృతంబులగు పద్యంబులే యుదాహృతంబు లగుచుండెడిని.

—• చతుర్యుగ స్వరూపము •—

పంచచామరము.

“ చతుర్యుగ స్వరూపముం బ్రసన్నదృష్టితోడ వి
శ్రుతంబుఁ జేయవే నను మాకు సూత! తత్ప్రమాణముల్
కృతాది తన్మహత్త్వమూడఁ గీర్తనీయ” మంచు ని
గతిన్ ద్విజాళి పృచ్ఛఁ జేయఁ గాంచి యాతఁ డిట్లనున్, 873

కం॥ “ ఇయ్యర్థంబుంగూరిచి
యయ్యింద్రుం డడిగియుండె నాచార్యుని ము,
న్నయ్యది వాక్రుచ్చెనో యతఁ
డయ్యది వచియించువాఁడ నాతయు మీకున్, 874

ఉ॥ తొల్లి శచీసమేతముగ దొడ్డసభాస్థలిఁ గూరుచుండి శో
భిల్లెడి పాకశాసనుని బ్రీతి భజించిరి వచ్చి దేవతా
తల్లజ సిద్ధ సాధ్య ముని దైత్య భుజంగమ కిన్నరాప్సరః
ఫుల్లసరోజ నేత్రలు ఋభుప్రభృతి స్తుతిపూర్వకంబుగన్ 875

కం॥ కలలుం గాష్ఠలు నిముస
ముల్లు నక్షత్రముల్లు గ్రహములు మాసాబ్దముల్
వెలసెడి సాంగశ్రుతులును
బలుతీర్థము లాలయములు భజియించె నటుల్, 876

చం॥ అటు సముపేతసంస్థితి సురాసురులెల్లరుఁ బ్రీతితోడ ము
న్నటి మునిరాట్చరిత్రములఁ బల్కుచు నొక్కరికొక్క రుంబరి
స్ఫుటగతిఁ జెప్పికొంచు నటఁ బ్రొద్దులు పుచ్చుచునుండ నింద్రుఁ డా
కృటి నవకానముంగని నికస్వరవత్తి సహస్రనేత్రుఁడై 876

కం॥ అవనీసురవరుఁడగు గురు
నవలోకనఁ జేసి " యుగమహాత్త్వము నాకుఁ
వివరింపు, కింస్వరూపము
లవి? వానిప్రమాణమెంత?" యని యడుగుటయుఁ 878

కం॥ గురుఁడిట్టులనియె, " వినుమో
పురుహూతా! యుగమహాత్త్వము న్నికఁ నే
నెఱిఁగింతుఁ, దత్ప్రమాణము
స్వరూపమును నవధరింపు వక్కాణింతుఁ, 879

వ॥ అష్టావింశతిసహస్రోత్తర సప్తదశలక్ష ౧౭౨౮౦౦౦ వర్ష పరిమితంబై కృతయుగంబు పొలుపారెను, నందు జనార్దనుండు శుక్లవర్ణుండును ధర్మంబు చతుష్పాదంబును వసుంధర సుసంపూర్ణంబును నైయుండు మఱియును. 880

కం॥ కామక్రోధవిరోధము
లేమాత్రము లేక నిర్జితేంద్రియులగుచుఁ
క్షేమించుచుంద్రు కృతయుగ
భూమిజను ల్శాంతిపరతఁ బూర్ణాయువులై 881

తే॥ పంచతాళ ప్రమాణులు బహుళశాస్త్ర
పాఠకులు నైన యోజను ల్పదియునాలు
వేలయేఁడులనయికును బొలురగుచుఁ
బరఁగుచుండుదు రోశచీప్రాణనాథ! 882

ఉ॥ ముప్పదియాఱువేల సమము ల్తరుణత్వముదాల్చి యోజనం
బప్పుడు వృద్ధభావమున కాస్పదమౌను బలాసురారి! య
ట్లప్పటివారిదైన పరమాయువు లక్షశరత్తు, లద్దియుం
దప్పును గొంతమందికెయెడఁ, దద్యుగసత్త్వ యదేమనన్వలెన్ 883

కం॥ తద్యుగమునఁ బశుపక్షిమృ
గాద్యఖిలాత్యల్పజంతు లైనను దీవివ
ద్విద్యావత్త్వముగలవై
హృద్య తదాదిత్యభాష నే మాటాడున్, 884

ఆ॥ ఆడుకొనుచునుండు సత్యాదియుగమున
ముంగిసయు భుజంగమును సతంబు,
ఎలుక పిల్లిమీఁద నెలమిం బరుండెడుఁ
గాక ఘూకములును గలసితిరుగు, 885

ఉ॥ సన్నుతకీర్తినం బుడమితో యవలి వ్రీహియవాది సస్యసం
పన్నతగల్గి స్వాదుఫలభాగినియయ్యెడుఁ, గల్పభూమిరు
ట్సన్నిభమౌచు నెల్లపుడు శాఖిచయంబు ఫలప్రసూన సం
ఛన్నతఁ గంటకంబులకు స్థానమొసంగకయుండు నయ్యెడన్. 886

కం॥ ఆవులు మధురక్షీరము
లేవేళను వలసినన్ని యిచ్చుచునుండున్,
దేవాధీశ్వర ! యగుఁబడి
కావలసినయంతవట్టు కమ్మనిఘృతమున్, 887

సీ॥ పతిహీనయగుచు నేపం కేజముఖియును
వెతనొంద దెన్నఁడుం గృతయుగమున,
సౌభాగ్యమెడలి యేసారంగనయనయు
మతిఁ గుంద దెన్నఁడుం గృతయుగమున,
గొడ్డురాలగుచు నేకుటిలకుంతలయును
ధృతిఁదూల దెన్నఁడుం గృతయుగమున,
శీలంబుఁబాసి యేశృంగారవతియు న
కీర్తిఁగా దెన్నఁడుం గృతయుగమున,

౭ నారాయణరావుగారు, దాతారుపల్లె

౮ వేలూరి రామన్న గుప్తగారు, సదాశివుని పేట

౯ రాయవారి బండేరావుగారు, అయినాపురం.

౧౦ రామూరి సుబ్బయ్యగారు – శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు – ముసలాపురం

౧౨ దండు గుండేరావుగారు, కరణము – ముసలాపురం

౧౩ తిరుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు – ముసలాపురం

౧౪ కానుమాను హనుమయ్యగారు, సర్వారావుపేట

౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౬ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౭ నరసింహస్వామివారు, యాదగిరి

౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౯ జాలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౧ బాలసాని సుబ్రహ్మణ్యంగారు, అక్కింగు కరణం, పాపయపాలెము

౨౨ చిక్కరాజు గట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౩ కవులూరి నరసింహారావుగారు, ఈలపోలు

౨౪ గోపీనాథ్ వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్‌స్పెక్టరు, [illegible]

౨౫ నడింపల్లి నరసింహారావుగారు, రిజిస్ట్రారాఫీసు క్లార్కు, క్రోసూరు

౨౬ రావికొండ వెంకటరామయ్యగారు, యినమడల

౨౭ కృష్ణసంతోష సుబ్బారావుగారు – పోలీసుసబిన్‌స్పెక్టరు – పిడుగురాళ్ళ

౨౮ ముండే చినవెంకయ్యగారు, దండమూడి.

౨౯ శ్యామావంతుల గోపాలరావుగారు–బందోబస్తు మొహతెమీమ్–వరంగల్లు

౩౦ కన్నయ్యగారి సంగయ్యగారు–ముసలాపురం

౩౧ చక్కిలం పాపయ్యగారు–ముసలాపురం

౩౨ తాళ్ళవలిమె లింగన్న మొకద్దంగారు–గడిపెద్దాపురం.

౩౩ కిషన్ రావు దేశపాండ్యాగారు– తాళ్ళపల్లి

౩౪ తొర్లకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౩౫ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

౩౬ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు, సాపురం

౩౭ చివుకుల శ్రీరామశర్మగారు– నాగులుప్పలపాడు

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కవిశిరోద్ధారిణి [పూరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | పుళిందావివాహము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 | పశ్యంపశ్యం | ... | 0 | 2 | 0 |
| 16 | పత్నీశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము | ... | 0 | 1 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోష్టు,
గుంటూరుజిల్లా.